27-11-1992 శుక్రవారం 12 పేజీలు సంపుటి : 63 సంచిక :48 విడిప్రతి : రు. 2.00

# జమీన్ రైతు

స్థాపకుడు : నెల్లూరు వెంకటరామానాయుడు

CROWN-TV
CROWN-TV కలర్ మరియు B/W TVలపై
DIGITAL 21
ఆథరైజ్‌డ్ డీలర్స్
స్టీరియో సౌండ్స్ Ph:25428
ట్రంక్ రోడ్-నెల్లూరు.

# వై ఎస్‌తో రాజీకి రామిరెడ్డి రాయబారం!

నివురుగప్పిన నిప్పులా వున్న వై.ఎస్.ను ఎలాగైనా రాజీకి ఒప్పిస్తే రెండేళ్ల దాకా తమ ప్రభుత్వానికి ఢోకా వుండదని కోట్ల వర్గీయులు అభిప్రాయపడ్తున్నారు. కోట్లకు కుడిభుజంగా వున్న రెవిన్యూమంత్రి రామిరెడ్డి అప్పుడే రంగంలోకి దిగి 'రాజీ' ప్రయత్నాలు ప్రారంభించారట. దీని ప్రభావం కారణంగానే రాష్ట్ర వ్యాప్తంగా సారాయి వ్యతిరేక ప్రచారంలో పాల్గొనాల్సి వున్న వై.ఎస్. తాత్కాలికంగా తన కార్యక్రమాన్ని వాయిదా వేసుకున్నట్లు తెలుస్తోంది.

వై.ఎస్. సూచించిన వ్యక్తులకు ఈసారి విస్తరణలో మంత్రి పదవులు కట్టబెట్టాలని వైఎస్ వర్గీయులు విధించిన షరతును రామిరెడ్డి ఇప్పటికే కోట్లకు చేరవేశారు. అయితే కోట్ల మాత్రం ఈ షరతుకు స్పందించకుండా దాటవేశారట. మంత్రి వర్గ విస్తరణ జరిగే వరకు వేచి చూసి ఆ తర్వాత భవిష్యత్ కార్యక్రమాన్ని

**రాజధాని రాజకీయం**

నిర్ణయించు కోవాలని వైఎస్ వర్గీయులు నిర్ణయించినట్లు తెలుస్తోంది.

## అసమ్మతి సరికొత్త రాగం

## "పోయినోడె మంచోడు"

అధికార పీఠం నుంచి నేదురుమల్లి నిష్క్రమణతో అసమ్మతీయులు కూడా అడ్రస్ లేకుండా పోయారు. జనార్దన రెడ్డిని గద్దె దించితే తమకు అందలం దక్కుతుందని భావించిన అసమ్మతీయులకు కొత్త ముఖ్యమంత్రి కోట్ల వాతలు పెట్టినట్లు పదవుల కోత కోశారు. జనార్దన రెడ్డి తర్వాత తామే ముఖ్యమంత్రులమని రంగుల కలలు కన్న కనీసం అరడజను మంది అసమ్మతి మంత్రులు ఇప్పుడు ఏ పదవీ లేకుండా ఈగలు తోలుకుంటున్నారు. అసమ్మతితో వీరంగం వేసిన మరో ముప్పయ్ మంది ఎమ్మెల్యేలు కొత్త ముఖ్యమంత్రి పెడ్తున్న 'వడపోత' భరించలేక ఉక్కబోసి ఉక్కిరిబిక్కిరి అవుతున్నారు. నెలరోజులు దాటినా "శ్రీవారి' 'మనసేమిటో

కొరవ 11 పేజీలో

# కోట్ల కోట చుట్టూ నెల్లూరు ఎమ్మెల్యేల ప్రదక్షిణాలు

నిన్నటి దాకా జనప్రియులైన నెల్లూరు జిల్లా ఎమ్మెల్యేలు నేడు కోట్లవారి కోట చుట్టూ ప్రదక్షిణాలు చేస్తున్నారు. అధికార దేవత 'అనుగ్రహం' కోసం అందరు ఎమ్మెల్యేల మాదిరిగానే నెల్లూరు జిల్లా ఎమ్మెల్యేలు కూడా 'విజయా' నీ దయరాదా?" అంటూ రోజూ కోట్ల వారి కోట మెట్లు ఎక్కేసి వస్తున్నారట.

డిసెంబరు మొదటి వారంలో మంత్రివర్గాన్ని విస్తరిస్తానని కోట్ల ప్రకటించిన నేపథ్యంలో నెల్లూరు జిల్లా కోటాలో రెండో మంత్రి పదవికోసం జోరుగా పైరవీలు చేసుకుంటున్నారు. ఆత్మకూరు శాసనసభ్యుడు డాక్టర్ సుందర రామిరెడ్డి ఇంతకు మునుపే ఆనం సంజీవరెడ్డితో సిఫార్సు చేయించుకున్నారు. ఇక ఇప్పుడు నేరుగానే వెళ్లి కోట్ల దర్శనం చేసుకుంటున్నారు. రాపూరు శాసనసభ్యుడు వెంకటరత్నం నాయుడు మాత్రం 'సీనియారిటీ' చూసైనా తనకు మంత్రి పదవి ఇవ్వాలని తరచూ ముఖ్యమంత్రిని కలిసి విన్నవించుకుంటున్నారట. మొదటి

**ఎవరి ఆశ వారిది**

ఛాన్సు తప్పినా రెండో సారి తనకు ఖాయంగా మంత్రిపదవి దక్కుతుందని కావలి యానాదిరెడ్డి ఆత్మవిశ్వాసంతో ముఖ్యమంత్రి చుట్టూ ప్రదక్షిణలు చేస్తున్నారు. కోట్లను ప్రసన్న

కొరవ 11 పేజీలో










కోవూరు కో ఆపరేటివ్ చక్కెర ఫ్యాక్టరీ చెరకు అభివృద్ధి మండలి అధ్యక్షులుగా నన్ను నియమించినందులకు

నా హృదయపూర్వక కృతజ్ఞతలు

ఆం.ప్ర. ముఖ్యమంత్రి
గౌ. కోట్ల విజయభాస్కర రెడ్డి గారికి,

ఒంగోలు పార్లమెంటు సభ్యులు
మాగుంట సుబ్బరామరెడ్డి గారికి

ఆం. ప్ర. మాజీ ముఖ్యమంత్రి
గౌ. నేదురుమల్లి జనార్దన రెడ్డి గారికి

ఆం.ప్ర.చక్కెర శాఖామాత్యులు
గౌ. మహమ్మద్ జానీ గారికి



కోవూరు చక్కెర ఫ్యాక్టరీ చైర్మన్
సామంతు సుబ్బారెడ్డి

కోవూరు పంచదార కర్మాగార చైర్మన్
సామంతు సుబ్బారెడ్డి గారికి

ఈ అవకాశాన్ని సద్వినియోగ పరచి నా శాయశక్తులా చెరకు రైతుల అభివృద్ధికి కృషి చేయగలనని మనవి చేస్తున్నాను

యేటూరు శివరామకృష్ణారెడ్డి
చెరకు అభివృద్ధి మండలి అధ్యక్షులు, కోవూరు, కో ఆపరేటివ్ షుగర్ ఫ్యాక్టరీ, రేబాల

# ఉత్తరక్రియలు



మా ఇంటి పెద్ద, మా అందరి అభివృద్ధికి కారకుడు

# శ్రీ బెజవాడ సుబ్బారెడ్డి

( స్వర్గీయ బెజవాడ రామచంద్రారెడి గారి తనయుడు )

19-11-1992 తేది గురువారం స్వర్గస్తులైనారు. వారి ఆత్మశాంతికై భగవంతుని ప్రార్థిస్తున్నాము.

ఉత్తరక్రియలు

2.12.1992 తేది బుధవారం ఎత్తురేవు

కొండ్లపూడి గ్రామంలోని మా స్వగృహంలో జరుగును.

బంధుమిత్రులు తెలియగోరుతాము.

*భార్య - బెజవాడ రామమ్మ*

కుమారులు - కోడళ్లు
బెజవాడ కుమారస్వామిరెడ్డి - శారద
బెజవాడ ఫణీంద్ర రెడ్డి - పద్మ
బెజవాడ భరణి రెడ్డి - మాలతి

కుమార్తెలు - అల్లుళ్లు
కోటిరెడ్డి సీతమ్మ - సుదర్శన్ రెడ్డి
చిట్టమూరు దేవసేన - శ్రీధర్
కేతినేని సురేశ్వరి - వెంకురెడ్డి

మనుమళ్లు — మనుమరాళ్లు

# జమీన్‌రైతు

## అయోధ్య అణుబాంబు

అయోధ్య రామాలయం బిజెపికి ఒక ఆట వస్తువు. ఎప్పుడు సరదా కల్గితే అప్పుడా ప్రస్తావన తెచ్చి ఆగం చేస్తుంది.ఐ బ్రహ్మాండం బద్దలై పోయేట్లు భయపెడుతుంది; చూడు నా తడాఖా అని దబదబలు చేస్తుంది; అనుకొన్న ఎఫెక్ట్ వచ్చిన తర్వాత సైగ్గా ప్రక్కకు తప్పుకుంటుంది. గత ఐదారేళ్లలో బిజెపి ఈ వెర్రి చేష్టలు చేయడం ఇప్పటికి ఎన్ని సార్లో! తాజాగా డిసెంబరు 6 తేది కరసేవకు పిలుపునిచ్చింది. 10 లక్షల మందిని సేకరించి, వివాద స్పద ప్రదేశంలో వారి చేత రామాలయం నిర్మిస్తుందట. పోలీసు లారీలు, మిలిటరీ తుపాకి తూటాలకు ఎదురొడ్డి నిలుస్తుందట. లోకాలన్నీ ఏకమైనా గుడి కట్టి తీరుతుందట.

మతాన్ని అడ్డు పెట్టుకొని అధికార పీఠం అధివసించడానికి బిజెపి నాయకులు పడ్తున్న పాట్లకు అయోధ్య రాముడు ఒక ఉపకరణం కావడం నిజంగా దురదృష్టకరం. కేవలం రాముడి పై భక్తితో వారీ దురాగతానికి పాల్పడుతున్నారని పిచ్చి వాళ్లు కూడా నమ్మరు; నమ్మలేరు. వారికి కావలసింది ఎర్రకోట నివాసం; అందుకివన్నీ సాకులు. రామాలయం పేరుతో ఉద్రిక్తతలు రెచ్చగొట్టి, ఉన్మాదావేశాలు ప్రేరేపించి, ప్రజల్లో చీలిక తెచ్చి, మెజారిటీ పక్షాన్ని తమ వశం చేసుకోనిదే ఇంకెన్ని తరాలు గడిచినా ఢిల్లీ పీఠం తమకు చేరువ కాదన్న కుట్రతోనే వారీ దుర్మార్గానికి తలపడుతున్నారు. మసీదును తాకకుండా, వివాదాస్పద ప్రదేశంలో ఆలయం నిర్మిస్తామని వారు చెప్తున్నవి కల్లబొల్లి కబుర్లు; ఏ మాత్రం అవకాశం చిక్కినా బాబ్రీ మసీదు కట్టడాన్ని పునాదుల్తో సహా పెకలించడానికి ఛాందస భావుకులైన సాధువులు వెనుదీయరని గతంలోనేస్పష్టమైంది. ఇప్పుడు ఇన్ని లక్షల మంది అక్కడ చేరడం జరిగితే, ఎటువంటి విధ్వంసం జరుగుతుందో, దానిపై దేశంలో ఎంతటి విపత్కర వాతావరణం, అరాచకత్వం చెలరేగుతుందో వూహించలేము.

దేశంలోని అతి పెద్ద రాజకీయ పార్టీలలో ఒకటి, దేశాన్నిట్లా అశాంతి మయం చేయడానికి అణుబాంబుతో సమానమైన అయోధ్య సమస్యను రగిలించే యత్నం చేయడం భారతీయులు చేసుకున్న దౌర్భాగ్యం. 400 ఏళ్ల నుంచి వున్న వివాద పరిష్కారానికి సుప్రీం కోర్టు తుది తీర్పు వెలువడే వరకు వేచి చూడలేని అసహనం, ఓర్పులేమి ఆ పార్టీని ఆవరించడం దురదృష్టం. అయోధ్యలో రామాలయం వున్నా లేకపోయినా దేశానికి కాని, హిందూ మతానికి కాని, ప్రజలకు కాని ఒరిగే లాభము, నష్టమూ ఏవీ లేవు. అయోధ్యలో రామాలయం లేనంతమాత్రాన హిందూ మతానికి ఈ నాలుగు శతాబ్దాలలో ఏదైనా అప్రతిష్ట కల్గిందా? అపచారం కల్గిందా? మతం క్షీణదశకువచ్చిందా? హైందవులకు రాముడి పట్ల విశ్వాసం సన్నగిల్లిందా? ఏదీ లేదే! మరెందుకీ ఆగం, ఆందోళన, ఆవేశ కావేషాలు? ప్రభుత్వాన్ని ఇరకాటంలో పెట్టి, అస్థిరత్వం పాలు చేసి, ఆ సందట్లో మధ్యంతర ఎన్నికలు జరిపింపజేసి, తాము అధికారంలోకి రావాలన్న తృష్ణ తప్ప ఇప్పుడీ కరసేవకు మరొక పరమార్థం వుందా?

సానుకూల ప్రయత్నాలన్నీ విఫలమైనందువల్ల, కరసేవను నిరోధించడంలో కఠినంగా వ్యవహరిస్తామని ప్రధాని శ్రీ పివి నరసింహారావు ప్రకటించారు. దానికి తగినట్టే పెద్ద ఎత్తున సైన్య సమీకరణ చేస్తున్నారు. ఉత్తర ప్రదేశ్‌లోని బిజెపి ప్రభుత్వాన్ని బర్తరఫ్ చేయనున్నారన్న వదంతులూ విన్పిస్తున్నాయి. బర్తరఫ్ జరిపితే దేశ వ్యాప్తంగా ఉద్యమం లేవదీసి, పివి ప్రభుత్వాన్ని కూలద్రోయడానికి బిజెపి సిద్ధపడుతున్నది. డిసెంబరు 6 తేది దగ్గర పడే కొద్దీ రాజకీయ వర్గాలలో ఉద్రిక్తత, యుద్ధ వాతావరణం ఏర్పడుతున్నాయి. కరసేవ అంటూ జరుగుతుందో లేదో తెలియదు కాని ఈ వాతావరణ సృష్టి వల్ల బిజెపి మాత్రం బాగా లాభపడుతున్నది. వారికి కావలసిందీ అదే!

ఇప్పటికైనా మించి పోయింది లేదు. జాతీయ నాయకులు, పార్టీలు పలుకుబడి కల్గిన మేధావి వర్గాలు ఛాందసత్వంతో కళ్లు పొరలు గ్రమ్మి వున్న బిజెపి, విశ్వహిందూ పరిషత్, ఆర్ఎస్ఎస్ నాయకుల పై వత్తిడి తెచ్చి, వారి మూర్ఖత్వాన్ని వదిలించడానికి ప్రయత్నించాలి. రాజకీయ పరమైన దురుద్దేశ్యాలతో సామాజిక ఐక్యతను భగ్నం చేసే దుష్ట ప్రయత్నాలను నిరోధించాలి. రక్తపు టేరులలో తడిసి మునిగిన అధికార సింహాసనం ఎప్పటికీ శ్రేయస్కరం కాదన్న వివేకాన్ని వారిలో కల్గించాలి. దేశంలో అరాచకం తాండవించకుండా చూడాలి. అసలే మండల్ వ్యతిరేక ఆందోళనతో దేశంలోని యువత ఉడుకు మిడుకుగా వుంది. ఆ అగ్నికి ఈ వాయువు తోడు కావడమంటే జాతి భవితవ్యాన్ని చేతులారా ఆహుతి చేయడమే. అధికారం కోసం, పదవుల కోసం మన రాజకీయ వాదులు అంతటి దారుణానికి ఒడిగట్టరనే ఆశిద్దాం; ఆఖరు నిముషంలో నైనా కరసేవ ప్రయత్నం విరమింప బడాలని ఆకాంక్షిద్దాం!

# జమీన్‌రైతు

27-11-1992

6 పేజీలు అణా:

### రంధ్రాన్వేషి

### ఎ.సి. పార్కు

ఎన్నెన్నో తంటాలు పడి ఎ.సి. సుబ్బారెడ్డి గారు పార్కును ఖాయం చేయించుకున్నారు - యిది వారి ఆత్మప్రీతికరం - రేడియో శ్రోతలకు ఆనందకరం - కాని .

యిప్పుడు యీ ఆరామం - తగిన సంస్కారం లేక, మొదటి గలీజు స్థితికి వస్తున్నందుకు మాత్రం విచార పడవలసి వున్నది. చెట్లకు ప్రాపులేదు - పోసిన పాతయిసక దుమ్ము అయిపోయింది. పారవేసిన బీడీ ముక్కలు పర్వతోపమానాలై కూర్చునే సహించ కుండా వున్నది. యీ దుస్థితికి కారణం కమీషనరు గారి అశ్రద్ధ అనాలగదా! ఇది ఎవరి అజమాయిషీలో వున్నది? దీనిని మంచిస్థితిలో వుంచుటకు యికనైనా కమీషనరు గారు శ్రద్ధ తీసుకొంటారా!

పరాయి గ్రామాలవారు వచ్చి యీ తోటను చూస్తే "నెల్లూరు ఆరోగ్య ఆదర్శాన్ని" ఎంతగా వివగించు కొంటారో! లేక లేక ఒక లోకాయబుడితే - లోకాయకన్ను లొట్టబోయింది అనిపించ కండి.

అసలు కమీషనరు అంత సమర్థుడుగా కనిపించడంలేదులేండి.

### మూలప్పేట

వేద పాఠశాలలో మరల . తుఫాను

వేద పాఠశాలలో అత్యాచారాలు ఎన్నిమారులైనా విమర్శించండి - ప్రిన్సిపాలు గారికి తగ్గవలసిన అమర్షము పెరుగుతున్నదేగాని, తగ్గటం లేదు. అది ఆ సంస్థ దౌర్భాగ్యం.

ఆ కాలేజీలోనే చదివి - వూరికి - సంస్థకు ఖ్యాతితెచ్చిన జానకిరామిరెడ్డి ఉద్యోగ విషయంలో బ్రాహ్మణ అబ్రాహ్మణ వైషమ్యంలో తమ శాఖ వారికే యిచ్చుకొన్నారు అధికారులు.

## 50 ఏళ్ళ క్రితం ఈ వారం

ఇప్పుడు ఒక అధ్యాపక స్థానం ఖాళీ పడితే, నెల్లూరంతా గొడ్డు పోయినట్లు ఉత్తరాది నుంచి ఒక "V" మార్కు ఆయనను ప్రిన్సిపాలు గారి యిష్టుడని కాబోలు దిగుమతి చేయబోతున్నారు. సాకు - నెల్లూరులో అర్హులులేరంట - అసలు కాలేజీలో ప్యాసైన వారు యంబ్రహ్మ లంట! సెబాస్! కాలేజీకి ఎంతటి స్వయందత్త పారితోషికము! ఆ కాలేజీలో యిట్టి సవట సరుకు తయారు చేస్తున్నప్రిన్సుపాలును - తదితర టీచర్లను వూడబెరికి యుద్ధానికి పంపి, కాలేజిని మరామత్తు చేస్తె బాగుండదా కమిటీ వారు? ఎంత అపఖ్యాతి తెచ్చినారయ్య నెల్లూరుతలకు.

అసలు యీ కమిటీకి యీ హక్కు "నీవు నీ వారసులు ఆచంద్రతారార్కం అనుభవిం చుకోవలసింది" అని రిజిష్టరు చేసి యిచ్చినట్లున్నదే! కమిటీలో కొందరు 20 ఏండ్లకు పై బడి వున్నారే! కమిటీకి ఎలెక్షను లేదా? దీనికి సంబంధించిన వారు యీ లోపాలన్నీ సరిజేయగలిగితే వూరునాడు బాగుపడతవి.

ఇంతకు ముందు కాలేజీ సంగతులు వ్రాస్తె నా మీద చాలామంది బ్రాహ్మణస్వాములు కోపపడినారు. నేడు యీ ఉపాధ్యాయ నియామక అత్యాచారానికి సహించలేక ఆ బ్రాహ్మణులే ఆందోళన చేస్తూ ఒకమహజరు పెట్టుతున్నారు. ఎంతటి సుదినాలు! దీనికి రేబాల వారి కంచుకి (ఆడవాళ్లకంటె ఫ్రీగా జనానాలోకి పోగలిగిన నపుంసకలింగము) చతుర్వేదుల కృష్ణయ్య గారికి గూడ కోపం వచ్చి చేవ్రాలు చేయిస్తున్నారు. ఇక ఫలితం భిన్నంగా ఎందుకుంటుంది?

హనుమచ్ఛాస్త్రి గారు ఆయుర్వేద పండిత నియామకంలో గూడ కొంత ఘోరం చేసినారు. 3వ తరగతిలో పరీక్ష అయిన ఇద్దరు వ్యక్తుల విషయంలో ఉత్తమోత్తమాలు నిర్ణయించే శక్తి యీ ప్రిన్సిపాలుకు దప్ప యితరులకు కన్పించేటట్లు లేదు. ఇంతకూ అభిమానం అంటె యిదిటి వాళ్లు నోరు మూసుకొని వుండరా?

పాపం శమించును గాక!

# కూటికి లేని అగ్రకులాల వారి గతి ఎవరికీ పట్టదా?

## జనవాణి

వెనుకబడిన తరగతుల వారికి27 శాతం రిజర్వేషన్లు కల్పిస్తూ సుప్రీం కోర్టు ఇచ్చిన తీర్పు హర్షణీయమే. కాని దీనివల్ల ఆర్థికంగా వెనుకబడి, ఉన్నత కులాల వారని పిలువబడే కోట్లాది మందికి మరో సారి అన్యాయం జరిగింది. కూటికి, గూటికి, గుడ్డకు లేక అల్లాడి పోతున్నా నాయకులు, న్యాయాధికారుల చూపును ఆకర్షించలేక పోయారు. ఇకనైనా వీరికి కనీసం పదిశాతమైనా రిజర్వేషన్ సౌకర్యం కల్పించాలి, లేకుంటే ఇపుడు కల్పించిన బి.సి. రిజర్వేషన్లలో భాగస్తులను చేయాలి.

- బి. పట్టాభిరామయ్య

నెల్లూరు

### నిధుల దుర్వినియోగం

నెల్లూరు తెలుగు గంగ డివిజన్ పరిధిలోని కండ్లేరు మట్టి కట్టకు వెచ్చిస్తున్న నిధులు దుర్వినియోగమై పోతున్నాయి. అవినీతి అదుపు తప్పుతున్నది. ఇంజనీర్లు, వర్క్ ఇన్స్‌పెక్టర్లు, కంట్రాక్టర్లు కుమ్మక్కై కనీస పని నిబంధనలు పాటించక అధ్వాన్నంగా పనిచేస్తూ నిధులు దిగమింగుతున్నారు. కొన్ని పనులు చేయకుండానే చేసినట్లు బిల్లులు డ్రా చేస్తున్నారు. ఈ విషయంలో నెల్లూరులో వున్న సూపరింటెండెంట్ ఇంజనీర్‌కు చెప్పినా స్పందన లేదు. ఈ డివిజన్‌లో పనిచేస్తున్న ఇంజనీర్లు మారుతీకార్లలో తిరుగుతూ ట్రాన్స్‌ఫర్లు లేకుండా కాలం గడుపుతున్నారు. ఈ అవిని అంత మొందించే ప్రభుత్వాధికారి లేరా!

- రాజా

నెల్లూరు

### అగ్రవర్ణంలో పుట్టడమే పాపమా?

వెనుకబడిన తరగతులకు రిజర్వేషన్లు వర్తింపబడే అంశంపై సుప్రీం కోర్టు ఇచ్చిన తీర్పును ముందూ వెనుక చూడకనే రాజకీయ పార్టీల వారు వేనోళ్ల ప్రశంసించి తమ 'మేకవన్నెపులుల' స్వభావాన్ని చాటుకొన్నారు. ఒక్క పార్టీయైనా వాస్తవాన్ని, ఓట్లు పోతాయన్న భయంతో వేలెత్తి చూపలేరు. అగ్రవర్ణంలో పుట్టడమే పాపమా అనే వ్యధతో కుమిలి పోతున్న నిరుద్యోగ యువకుల

కొరవ 11 పేజీలో


## ఆచార్య పి.సి.రెడ్డి అభినందన సభ

### ఆహ్వానము

విద్యార్థి దశనుంచి, ఈ వయస్సులో కూడా అహరహం ప్రజాశ్రేయస్సుకోసం పోరాడుతున్న ఆచార్య పిసిరెడ్డి గారి 76 వ జన్మదినం 29-11-92 తేది ఆదివారం సాయంత్రం 6 గంటలకు నెల్లూరు ఆంధ్రసభలో మాతభూమి సుందరాచారి గారి అధ్యక్షతన అభినందన సభ జరుగును. అభిమానులు , పురప్రముఖులు, అందరూ విచ్చేసి సభను జయప్రదం చేయ ప్రార్థన.

డా.కె. హరిప్రసాద్ - సాయిపక్షవాత వైద్యశాల

పట్నం జగన్నాథం, - స్వర్ణకారులసేవా సంఘ అధ్యక్షుడు

- ఆచార్య పిసిరెడ్డి అభినందన కమిటి

# పెద్దాస్పత్రికి పట్టిన జబ్బు వదిలించేదెవరు?

ఎన్నిసార్లు వ్రాసినా, ఎంత ఘాటుగా విమర్శించినా చీమకుట్టినట్లు

**మందుల నుంచి పడకల దాకా అమ్ముడు కాని వస్తువే లేదు!**

కూడా ఫీల్ కాని సంస్థలలో మన పెద్దాస్పత్రి ఒకటి. దాని నిర్వాహకుల చర్మం ఎంత దళసరిగా తయారైందంటే పత్రికల వ్యాఖ్యలన్నీ దున్నపోతు మీద కురిసిన వర్షం మాదిరి నిరుపయోగమై పోతున్నాయి. వారిని తప్పు పట్టి ప్రయోజనం ఏముంది? ఆపద కల్గినప్పుడల్లా శంఖుచక్రాలు మరచి వచ్చే విష్ణు పరమాత్మ వలె వారిని ఆదుకునే ఆపద్బాంధవులు వుంటిరి; ఎనిది దర్యాప్తు జరిగినా, ఇంకే విచారణ జరిగినా నివేదికలు సైతం వెలుగు చూడకుండా తొక్కి పెట్టగల సమర్థులు వారికి అండగా వుంటిరి; ఇంక వారు పత్రికా వ్యాఖ్యలను ఖాతరు దులపరించినట్లుగా దులపరించుకొని తమ పాపపు పనులు నిర్విరామంగా కొనసాగించుకోవడంలో వింత ఏముంది?

నెల్లూరు పెద్దాస్పత్రికి పట్టిన పెద్ద జబ్బు, దాని అధినేతల అవినీతి, అసమర్థతలే! ఆస్పత్రిలో 25 మంది డాక్టర్లున్నారు; అందులో ఐదుగురు సివిల్ సర్జన్లు. అయితే ఈ ఇరవై ఐదుగురు మూడు వర్గాలుగా చీలిపోయారు. రెండు వర్గాలు ఆస్పత్రి పెత్తనం పై పేచీలు వచ్చి చీలితే, మూడవ వర్గం కులపరమైనదట. ముగ్గురికీ డాక్టర్లే నాయకులుకాగా వారి వారి బలాబలాల ప్రదర్శనకు సిబ్బందిని వంచుకున్నారు. సూపరింటెండెంట్ గారి

**డాక్టర్లు మూడు వర్గాలుగా చీలి కుమ్ములాడు కుంటున్నారు.**

వర్గం అన్నిటిలోకీ బలీయమైనది. వర్గాల మధ్య వచ్చే పంతాలు, పట్టింపులలో ఎప్పుడు ఆయనదే పై చేయిగా వుంటుందట.

ఈ చీలికల వల్ల ఆస్పత్రి భ్రష్టుపట్టి పోతూంది. ఎవరు ఎవర్నీ నియంత్రించే పరిస్థితి లేకపోవడంతో క్రమశిక్షణ అన్న పదానికి అర్థమే తెలియదు అక్కడ. ఎవరికి తోచిన రీతిలో, దొరికినంత మేర దోచుకొని తినడమే అక్కడి సాంప్రదాయం. మందులమ్ముతారు. ఎక్సరే ఫిలింలు అమ్ముతారు. ఇన్‌పేషంట్లకు పడకలమ్ముతారు. ఫినాయిల్ కూడా అమ్ముకొని తింటున్నారు. రోగులను జలగల్లాగ పట్టి పీడిస్తుంటారు. ఏ దారీలేక, ఎక్కడా గతిలేక, ఇంకెవ్వరూ దరిచేరనివ్వని పరిస్థితులలో మాత్రమే పెద్దాస్పత్రిలో చేరుతున్నారు రోగులు. పేదవారు అనుకున్న వారు కూడా ఒక పూట తిండి మాని, డబ్బు మిగుల పెట్టుకొని, ప్రైవేటు డాక్టర్ దగ్గరకు పోతున్నారే తప్ప, పెద్దాస్పత్రికి రావడం లేదని పేషంట్ల లెక్కలే చెప్తున్నాయి. 25 మంది డాక్టర్లుండే ఇంత పెద్ద ఆస్పత్రిలో రోజుకు వచ్చే రోగుల సంఖ్య కేవలం 250. ఇది వరకు వెయ్యి మందికి పైగా నిత్యం ఆస్పత్రికి వచ్చేవారు. పేషంట్లతో ఒపి రూములు మధ్యాహ్నం వరకు

**రోగుల సంఖ్య తగ్గుతూంది - చావుల సంఖ్య పెరుగుతూంది.**

కిటకిటలాడుతుండేవి. ఒపిలో కూర్చుంటే డాక్టర్లకు వూపిరి సలిపేదే కాదు. లోపల వరండా మొత్తం క్యూలు వుండేవి. అటువంటి ఆస్పత్రిలో ఇప్పుడు ఒపి

కొరవ 10 పేజీలో

ఆస్పత్రి ఆవరణలో గుబురుకుతున్న వార్డులోని పుల్లాకులు, వెళ్ళా వెరారం!

## అర్థశతం

[పాతికేళ్ల క్రితం 'పాతిక దాటిన రోజున' అన్న పేరుతో ఒక పద్య కవితను పాఠకుల కందించాను. ఇదుగో యాభై దాటిన వేళ ఈ 'అర్థశతం' అన్న వచన కవితను అందిస్తున్నాను., స్వీకరించండి]

**రసిక్**

జీవితమనే క్రికెట్ క్రీడలో
బ్యాటుపట్టుకొని వికెట్ ముందు
నిల్చున్నాను నేను
ఆట అంతగా రాదు; ప్రావీణ్యమసలే
లేదు;
అయినా రొప్పుతూ రోజుతూ
అలసిపోతూ
పరుగులు తీస్తూనే వున్నాను
ఇప్పటికి నా స్కోరు యాభైకిచేరుకొంది
ఈ హాఫ్ సెంచరీని, ఈ అర్థశతాన్ని
సాధించేందుకు
ఏమి యాతన ? ఏమి వేదన ?
ఎంత శోధన ? ఎంత రోదన?
నాకు బంతులు వేస్తున్నాడే వాడు,
ఆ బౌలరు
'విధి' నామధేయుడు;
విలాసపురుషుడు;
ఒక బంతిని వేసిన విధంగా ఇంకొక
బంతిని వేయడు
పలుమార్లు ఆ బంతుల గమ్మత్తు
విసరుకు, మెరుపు వేగానికి
తలదిమ్మ తిరిగి పోయింది
చేయి తిరగడం మానేసింది
కాలుకదపడం కష్టమైంది
మాట మిన్నకుండి పోయింది
అయినా ఔటు కాకుండానిలిచిపోయాను
చుట్టూ వున్న ఫీల్డర్లు సామాన్యులా
ఏమిటి?
ఒక్కొక్కరూ ఒక్కొక్క బెబ్బులి
'నిరాశ, నిస్పృహ, నిర్వేదం,
నిర్లక్ష్యం, నీరసం
దురుకుతనం, పిరికితనం, చింత,
వంత'-
ఈ ఫీల్డర్లు తెరిచివుంచిన చేతుల
పంజాల మీదుగా
రాచుకుంటూ దాటుక వెళ్లిన నేను
కొట్టిన బంతులు
ఒక్కో తడవ ఆ చేతులకు చిక్కినేల
పైకి జారి నన్ను మననిచ్చేవి
రెప్పపాటు కాలం గుండె ఆగి మళ్లీ
కొట్టు కొనేది
ఇక నా వెనుక వున్న వికెట్ కీపరు -
'అనారోగ్యం' వాని పేరు
ఎప్పుడెప్పుడు నన్ను స్టంప్ చేద్దామా
అనే
వానికున్న ఒకే ఒక్క ఉబలాటం
వాని ప్రయత్నాలు ఫలించినట్లే
ఫలించి నీరుగారి పోయేవి పాపం!
ఈ రీతిగా కొనసాగుతున్న నా ఆటను
''అంతకుడ'' నే అంపైర్ చేయెత్తి
ఔట్ అంటూ
అంతం చేసే అవకాశమింకా వచ్చింది
కాదు;
నాకెదురుగా, నాన్ స్ట్రైకింగ్
బ్యాట్స్‌మన్‌గా
'నాలోనికవి' నిలిచి వుంటాడు నా
ఆటను గమనిస్తూ
అడపాదడపా నాకు సలహాలు,
సూచనలూ ఇస్తూ
అయినా ఏదో ఒక బంతికి నేను
నిర్గమించక తప్పదు
నాతో బాటు 'నాలోని కవి' కూడా
ఆట నుండి అదృశ్యమౌతాడు
నా స్కోరు కాలగర్భంలోకలిసిపోతుంది
అతని స్కోరు అజరామరంగా
కాలాంబుధిపై తేలియాడుతుంది
అదే నాకు తృప్తి, అదే నాకు దీప్తి.

# పత్రికా రంగంలోనూ విలువలు పతనం

పెక్కు సమస్యలు ఎదుర్కొంటున్నా, ప్రజా సమస్యలను ప్రస్ఫుటీకరింప చేయడంలో ప్రధాన పాత్ర వహిస్తున్న చిన్న 'పత్రిక'ల సమస్యలు అర్థం చేసుకొని, వాటిని పరిష్కరించడంలో చేయూత నందిస్తానని సమాచార పౌర సంబంధాల శాఖ మంత్రి శ్రీ పసల పెంచలయ్య హామి ఇచ్చారు. 23 తేది టౌన్ హాల్‌లో జరిగిన జిల్లా చిన్న పత్రికల మహాసభలో ఆయన ప్రధాన అతిథిగా పాల్గొని ప్రసంగించారు. రాష్ట్ర వ్యాపితంగా వున్న చిన్న పత్రికల సమస్యలు తెలుసు కొనేందుకు ఈ పత్రికలు నిర్వహించే సదస్సులలో పాల్గొంటున్నట్లు చెప్పారు. చిన్న పత్రికలకు ప్రభుత్వ ప్రకటనలిచ్చే విషయం ఇప్పటికే ముఖ్యమంత్రితో మాట్లాడాను; కాని చిన్న పత్రికల సంఖ్య అసంఖ్యాకం; వాటన్నింటికీ ఏ విధంగా ప్రకటనలు ఇవ్వాలో మీరే సలహా చెప్పండి. జిల్లాలో 290 పత్రికలకు డిక్లరేషన్ ఉండింది. వాటిలో 200 రద్దుచేశాం. అక్రిడేషన్ పాస్‌లు మొత్తానికి ఇవ్వాలంటే ఎలా? ఏవో ఒక నిబంధనలు రూపొందించి పాటించక తప్పదు అన్నారు మంత్రి. ఇటీవల కాలంలో అన్ని రంగాల్లో వలె పాత్రికేయ రంగంలో కూడా విలువలు దిగజారాయని, వాటిని తిరిగి పునరుద్ధరించుకొను పాత్రికేయులే స్వయంగా ప్రవర్తనా నియమావళిని రూపొందించు కోవాలన్నారు. నెల్లూరు శాసనసభ్యుడు శ్రీ జె.కె. రెడ్డి మాట్లాడుతూ చిన్న పత్రికలను ప్రభుత్వం నిర్లక్ష్యం చేసిందన్నారు. వాటికి సహాయ పడను

**సింహపురి**

తాను ఎల్లప్పుడూ సిద్ధమేనని మాట ఇచ్చారు. పోస్టల్ రేట్ల విషయంలో పార్లమెంటులో మాట్లాడగలనని నెల్లూరు ఎమ్పి కుమారి పద్మశ్రీ హామీ ఇచ్చారు. కలెక్టర్ శ్రీ ఎం. సాంబశివరావు, చిన్న పత్రికల సంఘాధ్యక్షుడు శ్రీ ఎస్. చెన్నయ్య తదితరులు సభలో మాట్లాడారు.

### మంత్రిచే రుణాల పంపిణీ

గ్రామీణ ప్రాంతాల్లోని చేతి వృత్తుల వారికి, బెత్సాహిక సంస్థలకు జిల్లా ఖాదీ గ్రామీణ పరిశ్రమల మండలి మంజూరు చేసిన రుణాలను రాష్ట్ర సమాచార శాఖ మంత్రి శ్రీ పి. పెంచలయ్య 24 తేదీ పంపిణీ చేశారు. 2.3 లక్షల రూపాయలు విలువచేసే ఈ రుణాలను 155 మంది లబ్ధిదారులు టౌన్‌లోని అంబేద్కర్ భవన్‌లో జరిగిన ప్రత్యేక కార్యక్రమంలో మంత్రి చేతుల మీదుగా అందుకొన్నారు. జిల్లా కలెక్టరు శ్రీ ఎం. సాంబశివరావు - లబ్ధి దారులకు రవాణా ఖర్చులు తగ్గించడానికి వీలుగా ఆయాగ్రామాల్లోనే రుణాల పంపిణీ కార్యక్రమం చేపట్టాలని అధికారులకు సూచించారు. 91-92 లో ఖాదీ బోర్డు ద్వారా 7 769 మంది లబ్ధిదారులుకు, 46.49 లక్షల ఆర్థిక సహాయం చేయాలని సంకల్పించినట్లు చెప్పారు. ఖాదీ గ్రామీణ పరిశ్రమల మండలి అభివృద్ధి అధికారి బి. నరసింగరావు, డి.ఆర్.డి.ఏ.ప్రాజెక్టు డైరక్టర్ శ్రీ ఆదిత్య దాస్ ఈ కార్యక్రమం లో పాల్గొన్నారు.

### మంత్రికి సన్మానం

జిల్లా వెద్యూలు కులాల ఉద్యోగుల సంక్షేమ సంఘం మంత్రి

కొరవ 11 పేజీలో


జెంట్స్ రెడీమేడ్స్
సూటింగ్స్ & షర్టింగ్స్
షర్ట్స్, ట్రౌజర్స్, జీన్స్, కుర్తా సెట్స్, టీ-షర్ట్స్
విమల్ జంక్షన్
కాపువీధి :: నెల్లూరు. ఫోన్ : 25420

# గూడూరు ఆర్‌టిసితో ప్రయాణీకుల అగచాట్లు

గూడూరు ఆర్‌టిసి డిపో అధికారులు, సిబ్బంది ప్రజల పట్ల చూపుతున్న అలక్ష్యం మరీ మితిమీరి పోతాంది. ప్రజలు తమ సమస్యలు తెలుపు కొందామంటే అధికారులు అందుబాటులో ఉండరు. బస్టాండుమొదలుకొని బస్సెక్కి గమ్యం చేరేదాకా ప్రయాణీకులు పడే అవస్థలు అన్నిన్నికావు. బస్సులో లగేజి వేయాలంటే అక్కడ పున్నపోర్టర్ వెయాల్సిందే. వారు అడిగిన కూలి ఇవాల్సిందే; ఇవ్వకపోతే బెదిరించి మరీ వసూలు చేసుకొంటారు. లగేజి బస్సులో వేస్తె కండక్టర్ పేచి పెట్టారు. అక్కడనుండి నిమ్మకాయల బస్తా 30కి.మి. దూరానికి చేరవేసేందుకు ఒకటిన్నర రూపాయల లగేజి టిక్కెట్టు ఇచ్చి 2.50 రూపాయలు అదనంగా వసూలు చేసి జేబులో వేసుకుంటారు కండక్టర్. ఇదేమని నిలదీస్తె మరుసటి రోజు లగేజి బస్సులోపల వేయకుండా పైన వేసుకొమ్మంటారు. ఒక్కొక్కసారి బస్సు ఆవరు. చిల్లర ఇచ్చే విషయంలో కూడా వివాదం జరుగుతుంటుంది. చిల్లర ఇవ్వని వారిని దూషించడం, టిక్కెట్ వెనుకరాయడం, 25 పైసలు వంటి చిల్లరలు ఇవ్వకపోవడం వంటివి సాధారణం. కొందరు డ్రైవరు, కండక్టర్‌లు మేము ఫలానా ఊరికే పోతాము అని చెప్పి అరూటుకు వేయించుకొంటారు. ఆర్టీసిలో కూడా అవినీతి పుష్కలంగా వుండనడానికి పై నిదర్శనాలు చాలునేమో. రొక్కు బస్సులను ఎక్స్‌ప్రెస్ బస్సులుగా వేయడం, అధిక చార్జీలను వసూలు చేయడం వంటివి సర్వసాధారణ మయిపోయాయి. గ్రామీణ ప్రాంతాలకి వెళ్ళే బస్సుల కుండే నేమ్ బోర్డులకు లైట్లు వెలగవు. వీటిని గూర్చి పట్టించుకోరు. ఇటీవల కురిసిన భారీవర్షాలకు గూడూరు ఆర్టీసి డిపోకు నాలుగు లక్షల రూపాయలు నష్టం వచ్చిందని ఆర్టీసి వర్గాలు పేర్కొన్నాయి. ఈ డిపోలో రోజుకు లక్షా 70 వేలు వసూలు అవుతున్నదట. కాని సౌకర్యాలు మాత్రం శూన్యం. ప్రజల సౌకర్యంకోసం కంట్రోల్ పాయింట్‌లో ఫిర్యాదుల పుస్తకముంచి, నేమ్ బోర్డులకు లైట్లు వెయించి, బస్సు వేళలు బోర్డుమీద వ్రాయించి, సకాలంలో బస్సులు తిరిగేందుకు తగుచర్యలు తీసుకోవాలని ప్రయాణీకుల కోరిక.

## జిల్లావార్తలు

### సమస్యల పరిష్కారానికి సమీక్షా సదస్సులు

వివిధ మండలాల్లో ప్రజలు ఎదుర్కొంటున్న సమస్యల పరిష్కారానికి జిల్లా అధికారులను మండల కేంద్రాలకు తీసుకొచ్చి సమీక్షా సదస్సులు ఏర్పాటు చేస్తున్నట్లు రాష్ట్ర సమాచార, పౌర సంబంధాలశాఖ మంత్రి శ్రీ పసల పెంచలయ్య చెప్పారు. అందువల్లే తాను శంకుస్థాపనలు, ప్రారంభోత్సవ కార్యక్రమాల్లో పాల్గొనడంకన్నా సదస్సులకే ప్రాధాన్యత ఇస్తున్నట్లు 23తేది ఆయన పాల్గొన్న దొరవారి సత్రం మండల సమీక్షా సదస్సులో పేర్కొన్నారు. మండలంలో అతిసారావ్యాధి తీవ్రమై 6మందికి పైగా మరణించినా అధికారులు నిమ్మకు నీరెత్తినట్లున్నారని వెలికాడు, నేరికాడు, కల్లూరు గ్రామాల సర్పంచ్‌లు మంత్రి దృష్టికి తీసుకొచ్చారు. తక్షణ చర్యలు తీసుకోవలసిందిగా మంత్రి కలెక్టర్‌ను ఆదేశించారు. ప్రపంచ బ్యాంకు నిధులతో నిర్మితమౌతున్న రోడ్డుకు కొన్ని కల్వర్టరు కడితే గ్రామంలోకి బస్సువచ్చే వీలవుతుందని సర్పంచ్ మంత్రికి విన్నవించారు.

నెర్రికాలువలో గుర్రపు డెక్క ఆకు పేరుక పోవడంవల్ల వ్యవసాయానికి ఇబ్బందిగా తయారైందని చెప్పడంతో దాన్ని తొలగించడానికి మంత్రి తక్షణం 20వేలు మంజూరు చేయించారు. నెలబల్లి గ్రామంలో 1974 సంవత్సరంలో బడుగు వర్గాల వారికి ఇచ్చిన భూమికి నీరు అందించే విషయంలో సబ్ కలెక్టర్ శ్రద్ధ చూపించాలని మంత్రికోరారు. సదస్సులో, జిల్లాఅభివృద్ధి అధికారి ఆదిత్యనాథ్ దాస్, గూడూరు సబ్‌కలెక్టర్ సునీల్ శర్మ, జిల్లా

కొరవ 8 పేజీలో

# ప్రతి పల్లెటూరు కలరా చావులతో కలవర పడుతూంది!

జిల్లాలో కలరా ఏమాత్రం తగ్గుముఖం పట్టలేదు. పైపెచ్చు విపరీతమౌతున్నది. కలరా వ్యాధిబోకని గ్రామం తీర ప్రాంతంలో ఎక్కడాలేదనడం అతిశయోక్తి కాదు. అధికారుల లెక్కల ప్రకారమే ఆస్పత్రుల్లో 35 మంది రోగులున్నారు. నెల్లూరు, గూడూరు, కావలి వెటు ఆస్పత్రులలో చికిత్స పొందుతున్న రోగుల సంఖ్య ఎంతో చెప్పలేము. చావులూ జాస్తిగానే వున్నాయి. అల్లూరు, మనుబోలు, సూళ్ళూరుపేట, వెంకటగిరి మండలాలలో కలరా మహమ్మారి ముమ్మరంగా వున్నట్లు వైద్యశాఖ చెబుతున్నది. నెల్లూరు టౌన్‌లోనూ అదే పరిస్థితి. జిల్లా వైద్య ఆరోగ్య శాఖాధికారి కార్యాలయంలో ఇందుకోసం ఒక ప్రత్యేక సెల్ ప్రారంభించారు. అక్కడ ఇరవైనాలుగు గంటలూ సిబ్బంది వుంటున్నారు. జిల్లామొత్తం మీద 61 టీములు వ్యాధి నివారణకు, చికిత్సకు పని చేస్తున్నాయి. అల్లూరులో ముగ్గురు డాక్టర్లను, ఇస్కపల్లిలో ఒక డాక్టర్‌ను ప్రత్యేకంగా నియమించారు. వారు రాత్రి, పగలు పనిచేస్తున్నారట. ప్రైవేటు ఆస్పత్రిలో చేరినా , పేదవారని రుజువైతే ఆరోగ్యశాఖ ఉచితంగా మందులు సరఫరా చేస్తున్నది. ఇప్పటివరకు జిల్లాలో 10 వేల మందికి వ్యాక్సిన్లు పోశారట; 20 వేల మందికి మందులిచ్చారు. 11వేల బావుల్లో క్లోరిన్ చల్లారు. 841 ఇళ్లను శుభ్రపరిచారు. అధికారుల అంచనా ప్రకారం ఇప్పుడు వ్యాధి తగ్గుముఖం పట్టిందని చెప్తున్నారు. కాని పల్లెల నుంచి వస్తున్న వార్తలు మాత్రం ఆందోళన కరంగా వుంటున్నాయి. ప్రజలు భయపడి పోయివున్నారు.

**అధికారులెంత ప్రయత్నించినా అదుపుకావడం లేదు**

కలరా మృతులలో అధికభాగం నిరుపేదలు కావడం దురదృష్టకరం. పరిశుభ్రత పాటించి, స్వల్పమైన ఆరోగ్య సూత్రాలు పాటిస్తె నివారణ అయ్యే ఈ ప్రమాదకర జబ్బునుంచి పల్లెలను కాపాడ లేక పోవడం పట్ల ప్రభుత్వం సిగ్గుపడాలి. నెల్లూరుకు సమీపంలో వుండే కోవూరు తాలూకా గంగవరం వంటి గ్రామాలలోనూ కలరా చావులు సంభవిస్తున్నాయి. పిహెచ్‌సిలు, ఆరోగ్య కార్యకర్తలు, అక్షరాస్యత కార్యక్రమంలో భాగంగా జరిగిన ఆరోగ్య ప్రచారం వంటివేవీ పల్లెలను ఈ మహమ్మారి నుండి కాపాడ లేక పోతున్నాయి.

## స్మృత్యంజలి...

మా అభివృద్ధికి కారకులు,
నిరంతరం మా హృదయాలలో
నిలచిపోయిన

**ఈతముక్కల రామిరెడ్డి గారు**

బుచ్చిరెడ్డి పాళెం

ఆరవ వర్థంతి **25.11.92** తేది

వారికి మా శ్రద్ధాంజలి ఘటిస్తూ

- కుటుంబసభ్యులు



జననం: 1898 మరణం: 1986

# నెల్లూరు ముచ్చట్లు
## విమర్శకుడు

### రంగయ్యనాయుడు అల్లూరు వస్తారు

కేంద్ర కమ్యూనికేషన్ల మంత్రి శ్రీ పి.రంగయ్యనాయుడు డిసెంబరు మొదటి వారంలో అల్లూరు వస్తున్నారు. కార్యక్రమం చిన్నదే. మైక్రోవేవ్ టవర్‌కు శంకుస్థాపన. పిలిచేవాడు 'పచ్చ' కావడంతో పైగా పట్టింపు లేకుండా వస్తున్నట్లున్నారు మంత్రివర్యులు. ఎలా వస్తున్నారు కాబట్టి, వారికిది గుర్తుగా నెల్లూరు పోస్టుకు ఏదైనా ఉపకారం చేసి పోకూడదా, రంగయ్యా!

### జర్నలిస్టుల ప్రదర్శన

[illegible] ఇండియన్ ఎక్స్‌ప్రెస్ విలేఖరి శ్రీ రామమోహనరావుపై జరిగిన హత్యాప్రయత్నంతో సహా రాష్ట్రంలో జర్నలిస్టులపై పెరిగిపోతున్న దాడులకు నిరసనగా నెల్లూరు పాత్రికేయులు రేపు (28తేది) ఒక ప్రదర్శన జరుపనున్నారు. ఇందులో రాష్ట్ర యూనియన్ నాయకులుగా పాల్గొంటున్న శ్రీ ఆనం వివేకానందరెడ్డి లాంటి వారు ఏర్పాట్లు చేస్తున్నారు; ఇతర పార్టీల నాయకులూ సహకరిస్తున్నారు.

### పోస్టల్ ఆర్డర్లు బ్లాక్‌లో అమ్మారు

పోస్టాఫీసులు సాధారణంగా అవినీతికి దూరంగా వుంటాయి. అది నిజాయితీయేమీ కాదు. అవకాశం లేకపోవడం నిరూపించడానికి కాబోలు నెల్లూరు పెద్ద పోస్టాఫీసు సిబ్బంది మొన్న శనివారం (21తేది) పోస్టలార్డర్లను బ్లాకులో అమ్మారు. ఆరోజు పబ్లిక్ సర్వీసు కమీషన్ పరీక్షలు; హాల్ టిక్కెట్‌తో పాటు పదిరూపాయల పోస్టలార్డరు జత చేయాలి. వేల సంఖ్యలో అభ్యర్థులున్నారు. అందరూ ఒక్కసారి ఎగబడే సరికి పోస్టాఫీసులో పెద్ద రద్దీ అయిపోయింది. అప్పటికీ పోస్టు మాస్టరు ప్రత్యేక శ్రద్ధతీసుకొని, సమయం మించిపోయిన తర్వాత కూడా కౌంటర్ తెరిపించారట. కాని సిబ్బంది, అదను చూసుకొని పదిరూపాయల పత్రాన్ని పదిహేను లెక్కన అమ్మారట. విధిలేక అందరూ ఆ రేటుకే కొన్నారు. కాదంటే పరీక్షకు హాజరు కాలేరు కదా! పోస్టుమాస్టరు గారూ - ఏమిటీ పరిస్థితి; దర్యాప్తు జరిపి దోషులపై చర్య తీసుకోండి; లేకుంటే పోస్టాఫీసు పరువు పోతుంది.

### తడ స్మగ్లర్ అరెస్ట్

తిరుపతి విజిలెన్స్ ఎస్పిగా శ్రీ భూపతి బాబు నియామకం జరిగినప్పటి నుంచి తడ బియ్యం స్మగ్లర్లకు గుండెల్లో వణుకు పుడుతున్నది. అవినీతితో అదుపు తప్పిన తన శాఖను ఆయన దారిలో పెట్టారు. ఇప్పుడు ఒక్క లారీ బోర్డరు దాటడం లేదు. లంచాలు తినమరిగి, ఇంత కాలం స్మగ్లర్లకు ఊడిగం చేసిన ఎస్‌ఐలు, ఇతర సిబ్బంది చేతనే ఆయనీ పని చేయించగలగడం ప్రశంసనీయం.

అంతకంటె విశేషం - తడ ప్రాంతంలో పేరుమోసిన స్మగ్లర్ చిల్లకూరు హరనాథరెడ్డిని అరెస్టుచేయడం. 22 తేది వేకువన హరనాథరెడ్డిని అరెస్టుచేశారు. అతడికి సంబంధించిన ఆరు లారీలు, ధాన్యం స్వాధీనం చేసుకున్నారు. హరనాథరెడ్డి పేరు చెప్తే చెక్ పోస్టుల్లోనే కాకుండా, తడ గ్రామాల్లో నూ [illegible] అతని లారీలను ఆపే దమ్ము ఎవరికీ వుండేది కాదు. ఒక వేళ అడ్డువస్తే తొక్కించి వెళ్ళి పోవడం అలవాటని చెప్తారు. అప్పుడప్పుడు కేసులు నమోదైనా, హరనాథరెడ్డి కార్యకలాపాలకు అవి అడ్డంకులు కాలేక పోయాయి. విజిలెన్సు ఎస్పి శ్రీ [illegible] ఇప్పుడీ సాహసం చేశారు.

అయితే హరనాథరెడ్డి తెలుగుదేశం నాయకుడని, కాంగ్రెస్ స్మగ్లర్ల జోలికి పోకుండా అతణ్ని మాత్రమే అరెస్ట్ చేశారని ఒక విమర్శవస్తున్నది. భూపతిబాబు గారు తన సమదృష్టిని క్రియాత్మకంగా రుజువు చేయగలరని ఆశిద్దాం!

### దోపిడిముఠా దొరికింది

కోవూరు ప్రాంతంలో పలు దోపిడీలకు పాల్పడిన ఒక ముఠాను పోలీసులు పట్టుకోగల్గారు. రామన్నపాలెంకు చెందిన ముగ్గురు- మలిసినూరు పుల్లయ్య, నవూరు చిన నరసయ్య, నక్కా చెన్నయ్య- కోవూరు పరిసరాలలో చాలా దోపిడీలకు పాల్పడ్డారట. ఆమధ్య పొలాల్లో ఒక గిరిజన యువతిని మానభంగం చేసిన నీచులూ వీరేనట.

### బ్యాంకు దోపిడి కేసు ఏమైంది?

నెల్లూరు ట్రంకురోడ్డులోని కరూర్ వైశ్యాబ్యాంక్‌లో రెండు నెలల క్రితం జరిగిన దోపిడీ కేసు ఏమైంది? ఆరోజు బ్యాంకు సందర్శించిన ఎస్పి శ్రీ కృష్ణప్రసాద్‌గారు - 48 గంటలలో దోషులను పట్టేస్తానని చెప్పారు; కాని 48రోజులైనా పురోగతి వున్నట్లు లేదు. మాట ఇచ్చినందుకైనా పట్టుదల చూపడం అవసరం కాదటండీ - ఎస్పిగారూ!

### ఫోరం జరిమానా

తిరుపతి చెందిన ఒక కంప్యూటర్ కంపెనీకి నెల్లూరు వినియోగ దారుల

కొరవ 7 పేజీలో

### స్వాతంత్ర్యయోధుని అస్తమయం



కందుకూరు వాసి, స్వాతంత్ర్య పోరాటాలలో జైలు శిక్ష అనుభవించిన శ్రీ పిట్టుపల్లి రాధాకృష్ణయ్య (80) 16.11.92 తేది దివంగతులైనారు. ఆయన పచ్చి కాంగ్రెస్ వాది. జీవితాంతం ఖద్దరు ధారి; స్వర్గీయ చెంచు రామానాయుడు గారి విశ్వాసపాత్రుడైన అనుచరుడు. రాధాకృష్ణయ్య ఎంత గాంధీభక్తుడంటే, తన పెద్ద కుమారుడికి గాంధీ అని పేరుపెట్టుకున్నారు. ఆయన జిల్లా కాంగ్రెస్ అధ్యక్షుడుగా కూడా పనిచేశారు.

ఉత్తమదేశ భక్తుడు రాధాకృష్ణయ్య ఆత్మకు ఆ గాంధీ, శాంతిని ప్రసాదించుగాక. వారి కుటుంబానికి మా సానుభూతి.

స్త్రీల టానిక్
లోధ్ర
[illegible]
ఆరోగ్యమునకు [illegible]
90 సంవత్సరములుగా [illegible]
[illegible]
[illegible]
పేరు ....................
చిరునామా ....................
.... PIN ....................
తయారుచేయువారు
కేసరి కుటీరం (ప్రైవేట్) లిమిటెడ్
రాయపేట, మద్రాసు-600 014.
ఏజంట్లు: సీతారామ జనరల్ స్టోర్సు [illegible]
[illegible] - 1 - [illegible]

You name it
You get it
OPENED ON 26.11.92 at 8.30 AM
INAGURATION
SRI. W. RADHA KRISHNAIAH
Asst. General Manager (Region - 11) State Bank of India
Chief Guest
SRI. K.B.SANJEEVA RAO
(Manager State Bank of India, Town Branch, Nellore)
audunik times
WATCHES HOME APPLIANCES




Buy Allways with Confidence
one stop shop for your Entire family
SAIBABA COMPLEX, TRUNK ROAD, NELLORE.



నిర్మల రియల్ ఎస్టేట్స్ తొలి బంపర్ డ్రా సందర్భంలో వేదిక పై ఆశీనులైన శ్రీయుతులు బంది రామస్వామిరెడ్డి, ఆనం వివేకానంద రెడ్డి, వినియోగ దార్ల ఫోరం ఛైర్మన్ రేబాల రామచంద్రారెడ్డి, ఆనం రామనారాయణ రెడ్డి, సోమశిల ఎస్.ఇ. డి. రామిరెడ్డిలను చూడవచ్చు

## నెల్లూరు ముచ్చట్లు

(6 పేజీ తరువ )

ఫోరం పెద్ద జరిమానా వేసింది. బృందావనంలోని హోమియోపతి డాక్టర్ శ్రీ మదన్‌మోహన్ తిరుపతి ఐటి అండ్‌టి డీలరు దగ్గర ఒక కంప్యూటర్ కొన్నారు. డబ్బయితే పూర్తిగా కట్టారు కాని, డీలరు మాత్రం పూర్తి సామాన్లు ఇవ్వలేదు; కంప్యూటరు పనిచేయలేదు. విసిగివేసారిన ఆయన ఫోరంను ఆశ్రయించారు. న్యాయమూర్తి తీర్పుచెప్తూ- తక్షణం పనిచేసే కంప్యూటర్ ఇవ్వాలని, లేదంటే 56 వేల జరిమానా చెల్లించాలని ఆదేశించారు. వ్యాపారస్తులకు అమాత్రం దయం పెట్టకుంటే, వినియోగదారులు చాలా నష్టపోతారు.

### శివారెడ్డికి టీచర్ల సన్మానం

జమీన్‌రైతు కవి శ్రీ శివారెడ్డిని కోవూరు మండలం ఆం.ప్ర. ఉపాధ్యాయ సంఘం 15 తేది సన్మానించింది. కుమారి కె. పద్మశ్రీ, జాయింట్ కలెక్టర్ శ్రీ సతీష్ చంద్ర, సంఘం రాష్ట్ర ఉపాధ్యక్షులు శ్రీవి.రాజగోపాలరెడ్డి, జిల్లా ప్రధాన కార్యదర్శి శ్రీ ఎం.కృష్ణయ్య, ఎంఆర్‌ఓ శ్రీ ఎ.చంద్రమౌళి తదితరులు పాల్గొన్నారు.శివారెడ్డికి పట్టు శాలువా కప్పారో, లేక గట్టి పద్యం ఏదైనా ఇచ్చారో తెలియదు. మా శివారెడ్డికి కంటి చూపు అనక పోయినా, కవిత్వ కాగిత స్పర్శా భాగ్యం కల్గితేనే సంతృప్తి. ఈ సన్మానం ఆ సంతృప్తి కల్గించిందో లేక బస్ చార్జి వేస్తు చేసిందో పైవారం పద్యాల్లో తెలిసిపోతుంది కదా!



కీ.శే. గ్రిద్దలూరు అనంత నారాయణ రావు, బి.టెక్., (అనంత్)
జననం: 8.4.65
మరణం: 26.11.91

## ప్రథమ వర్ధంతి (26.11.92)

నీ జ్ఞాపకాలను
మరువలేని నీ కుటుంబసభ్యులు
తండ్రి: జి. శివశంకర రావు, తల్లి: బుజ్జమ్మ
అన్న: జి.వి. నాగరాజరావు, వదిన: సుధారాణి
అక్క: విజయలక్ష్మి, బావ: కె.ఎమ్. నరసింహులు
చెల్లి: జి. ఉమాశ్రీ మరియు
శ్రీ చైతన్య, శ్వేత, సాయిప్రత్యూష


# M.G.BROTHERS

NELLORE

We Solicit your esteemed presence on the occasion of inauguration of our

**BAJAJ DEALERSHIP AND LAUNCHING OF SUNNY**

On 29-11-1992 Sunday at 6.30 p.m.

**SRI MAGUNTA SUBBARAMA REDDY,** M.P. will Inaugurate **BAJAJ DEALERSHIP**

**SRI J.K. REDDY, M.L.A.,** will Launch the Sensational **SUNNY VEHICLE**

**SRI ANAM SANJEEVA REDDY** D.C.C. President will declare the **OPENING OF WORK SHOP**

**SRI S. SURYA PRAKASH** (Deputy Transport Commissioner) will Declare the Sale of **FIRST SUNNY**

**SRI J. SANKARA RAO GUPTA** (Asst. General Manager, Andhra Bank, NELLORE) will Declare the Sale of **FIRST CHETAK**

**SRI S.V. KULAKARNI** (Bajaj, PUNE) will declare the sale of **FIRST AUTO**

**SRI M.R. RAMESH** (Vice Chairman & Managing Director) Summpp, Schuele & Somappa Ltd., Bangalore) **SRI M. GANGADHARAM,** Ex. M.L.C., will raise the

**SRI P.V. PRASANNA REDDY,** (Kalyani Films)

**SRI MADAN MOHAN,** (Andhra Bank)

**DR. A.V. SUBRAHMANYAM**

Will participate

*Venue*: M.G. Brothers, Dargamitta, Nellore - 524 003.
Phones: 27917, 26413 & 24976


## కోట్ల సూత్రధారిగా జనార్ధన - వేమారెడ్డి మిత్రభేధం?

కొత్త ముఖ్యమంత్రి కోట్ల సూత్రధారిగా జనార్ధనరెడ్డి - వేమారెడ్డి రామచంద్రారెడ్డి మిత్రభేధం సీను త్వరలోనే రక్తికట్టేట్లు కనిపిస్తోంది. అధికారంలో వున్నా, అరణ్యవాసంలో వున్నా జనార్ధనరెడ్డినే అంటి పెట్టుకొని వుండిన రామచంద్రా రెడ్డి ప్రస్తుతం 'జనప్రియ'కు కాస్తంత దూరం జరిగి కోట్ల వారి 'కోట'కు దగ్గరవుతున్నట్లుంది. కొత్త ముఖ్యమంత్రి కూడా వేమారెడ్డికి పెద్ద పీట వేసి నెల్లూరు జిల్లా రాజకీయాలను 'మలుపు' తిప్పే ప్రయత్నం చేస్తున్నట్లు కనిపిస్తోంది. అధికారదేవత జనప్రియ నుండి కోట్ల వారి కోటకు బదిలీ అయినా, రామచంద్రయ్య విషయంలో మాత్రం పెద్దగా మార్పు వుండదని ఆశించారందరూ ; కాని ఆయన జనప్రియకు వెళ్లినట్లుగానే కోట్ల వారి కోటకు కూడా నేరుగా వెళ్తున్నారు. జనార్ధన రెడ్డి మాదిరిగానే కొత్త ముఖ్యమంత్రి కూడా రామచంద్రయ్యను అప్యాయంగా పలుకరించి అక్కున చేర్చుకుంటున్నట్లు వినికిడి. రామచంద్రయ్య కూడా కొత్త ముఖ్యమంత్రి గుణగణాలను తెగమెచ్చుకుంటూ కోట్ల వారి కోటను పడమటి గదిలా భావిస్తుండటంతో కొత్త ముఖ్యమంత్రితో 'స్నేహం' పెరిగి మా[illegible] దశకు చేరుకుందట. అయితే తనకు కోట్లతో స్నేహం కొత్తది కాదని, గత పలవై యేళ్లుగా బాగా పరిచయం వుందని రామచంద్రారెడ్డి 'శీల' పరీక్ష చేసుకుంటున్నారు. ముఖ్యమంత్రి దగ్గర వేమారెడ్డికి లభిస్తున్న గౌరవ మర్యాదలు చూస్తే మాత్రం నెల్లూరు జిల్లా రాజకీయాల్లో 'పెనుమార్పులకు' సంకేతమా? అన్నట్లుందని ప్రత్యక్ష సాక్షుల కథనం. గతవారం గూడూరు శాసన సభ్యుడితో కలిసి వేమారెడ్డి కోట్ల దర్శనార్థం వెళ్లారట. ముఖ్యమంత్రి గూడూరు ఎమ్మెల్యేతో ముక్తసరిగా మూడు మాటలు మాట్లాడి ఇక వెళ్లి రమ్మనాడట. ఆయన వెంట వచ్చిన రామచంద్రారెడ్డిని మాత్రం యాంటీ రూమ్‌లోకి తీసుకవెళ్లి మరీ ముచ్చటించారట. తనను కలుసుకునేందుకు వచ్చే వారితో మూడంటే మూడు మాటల్లో ముగించే ముఖ్యమంత్రి, రామచంద్రయ్య విషయంలో మాత్రం 'అతి ఉదారంగా' సమయం కేటాయించడం పట్ల నెల్లూరు జిల్లా రాజకీయ వాదులు చెవులు కొరుక్కుంటున్నారు.

- మా హైదరాబాద్ విలేఖరి

జమీన్‌రైతు
సంవత్సర చందా రూ100.
ఆరు నెలలకు రూ50.
విడిప్రతి రూ 2.00


**WANTED LECTURER in COMPUTER SCIENCE**

Appear Directly for INTERVIEW on 2.12.92 at 10 A.M. in the College Premises

**Qualifications:** M.C.A (or) Any P.G. Degree with P.G. Diploma in Computer Science or B. Tech Computer Science Experienced

Lady Candidates are preferred.

Dr. C.R. Reddy, M.S.,
Secretary & Correspondent
D.R.W. College, GUDUR.


**In the Court of Motor Acccident Claims Tribunal Nellore.**
OP613/91

Petioners D.Varamma and Others

Vs

Respondent L. Sambasiva Reddy and another

To
R1 L. Sambasiva Reddy
S/o. Rami Reddy , Lorry Owner, Kurnool Road, Ongole, Prakasam Dt.

ఈ నెంబరున పిటీషనర్లు పై కోర్టులో నష్టపరిహారము కొరకు OP దాఖలు చేసినందుకు మీకు నోటీసు నిమిత్తము 23-12-92 తేదిన కోర్టువారు వాయిదా వేసివున్నారు. మీకు గల ఆక్షేపణలు ఆరోజు ఉదయం గం 10.30.ని.లకు పై కోర్టులో మీరు హాజరై మీ ఆక్షేపణల తెల్పుకొన వలెను. లేని యెడల మీ పరోక్షమందు ఎక్స్‌పార్టీగా తీర్మానించబడును.

**V.V. Narasimhacharyulu**
పిటీషనర్ల అడ్వకేటు, కావలి

**Between the Motor Accidnents Claims Tribunal : Nellore**
IA 1700/91-OP No.92

Between:
E. Chanchu Chandra Reddy - Petitioners/Plantiff
Sri N. Chinnakotaiah &Another - Respondents/Detor

To
Narla Chinna Kotaiah,
S/o. Gurava
Owner of the Lorry ADM 8575
Governorpet, Vijayawada,
Krishna Dt.

పై నంబరున పిటీషనరు మీ లారీ యాక్సిడెంటు ప్రమాదము నందు జరిగిన నష్ట పరిహారమును రాబట్టుటకు మీపై పిటీషను దాఖలు చేసినందున మీ నోటీసు నిమిత్తము వాయిదా 8.12.92 నాటికి ఉన్నది. కావున ఆ రోజు ఉదయం 10.30 గంటలకు పై కోర్టు నందు మీరు కాని లేక మీ తరపున న్యాయవాది గాని హాజరై మీ ఆక్షేపణలను తెలుపుకోవలెను. లేని యెడల మీ పరోక్షంలో కేసు విచారించి తీర్మానించెదరు.

కె. ఉమామహేశ్వరరావు
వాది తరపున వకీలు

# శివారెడ్డి పద్యాలు

### ఆ దినాల్లో యీ దినాల్లో

పల్లెపల్లెగూడ ప్రతి వాడు కాంగ్రెసు
ఆ దినాల్లో యిప్పుడీ దినాల్లో
పల్లెపల్లె గూడ ప్రతి వాడు కామ్రేడు
ఇంతి పెంచియున్న ఇదొక కార్యం!

కాంగ్రెసుకు తెలు కరవాలనము చేసి
పోగమంపె వాళ్ల పత్యరించి
కాకి బియ్య యిచ్చి కాలమ్ము మారింది
ఆ దినాలు తిరిగి అంకురిచ్చు!

### కాలయముడు

మంచి చెడ్డ మట్టుమర్యాద అనవేల!
ముందు వెనుకలేదు ముంచు ఘటము
పెద్ద చిన్నలేదు పెరగబ్బ ముక్కోపి
కాల యముడు వాడి కడుపు గాల!

పండితులను కాటిపాల్జేసి యెందర్నో,
పేదగరిగినాళ్ళ పెద్దపెద్ద
కవుల గాయకులను, కన్దెసివ్వాడు
కంట్లోబెళ్లినాటు కవిని నేను!

### నా తల్లి శేషమ్మ

ఎక్కడుంటివో యిప్పుడెక్కడుంటివో శేషమ్మ,
నన్ను గన్నతల్లికన్నుమూసి
ఎంతోకాలమైంది, అంతూపంతూ లేద
యింత వరకు; యముడు గొంతు గోసె!

అంతరించి పోయె అర్ధాంగి గృహలక్ష్మి
తండ్రిబోయె కన్నతల్లిబోయె.
ఇక్కడుంది నేను ఏముంది సేసేది
వెళ్లి అడదాక మళ్లి వస్త!

ఎందుకు బుట్టిస్తాడో
ఎందుగ్గ జంపుతాడో యెవ్వడెరుగు యీ
మందల సృష్టి రహస్యము
గందరగోళమ్ము తెలియగాదుర మనకూ!

### లేగుంట పాడు గ్రామము

లేగుంటపాడు గ్రామము
భాగేగుల గూర్పు దెలుప బ్రహ్మకు తరమ
భోగంపెల్లర, పితరణ
త్యాగముండి వేరు మనకు దాంతో పన్లా!

## జిల్లా వార్తలు

(5 పేజీ తరువ )

గ్రంథాలయ సంస్థ ఛైర్మన్ బి. వెంగోపాలరెడ్డి పాల్గొన్నారు.

### అక్కరపాళెం ఇళ్లకు పునాది

దొరవారి సత్రం మండలం అక్కరపాళెం హరిజనవాడలో 6.72 లక్షల వ్యయంతో నిర్మించ నున్న హౌసింగ్ కాలనీకి రాష్ట్ర సమాచార శాఖ మంత్రి శ్రీ పెంచలయ్యసోమవారం శంకుస్థాపన చేశారు. ఇండ్లు కట్టుకోవాలను కుంటున్న 84 కుటుంబాలు దగ్గరుండి పూర్తి చేయించుకోవాలని మంత్రి కోరారు. ఈ హరిజన వాడ కోసం ప్రత్యేక రేషన్ షాపును మంజూరు చేయమని మంత్రి సబ్ కలెక్టర్‌ను ఆదేశించారు. హరిజనవాడలో పాఠశాల లేక పోవడం వల్ల పిల్లలు పెడత్రోవ పట్టి పోతున్న విషయంతోపాటు కాళంగినది నుండి ఒక కాలువను తమ పొలాల నుండి త్రవ్వించాలని హరిజనులు అభ్యర్థించారు. జిల్లా హౌసింగ్ బోర్డు మేనేజర్ శ్రీమతి ఉదయలక్ష్మి, సబ్‌కలెక్టర్ సునీల్‌శర్మ, డి.డి.ఓ. ఆదిత్యనాథ్ దాస్, ఈ కార్యక్రమంలో పాల్గొన్నారు.

### బుచ్చిగ్రామాల్లో మునిగిన పైర్లు

గతవారం కురిసిన వర్షాలకు బుచ్చిరెడ్డిపాళెం మండలంలో 15వేల ఎకరాలకు పైగా పంట దెబ్బతినింది. పెనుబల్లి, దామరమడుగు, వెల్లాయపాళెం, పల్లిపాళెం, రేబాల గ్రామాల్లోని పొలాలు నీటితో నిండిపోయాయి. మురుగు నీరు పోయే అవకాశం లేక పోవడం వల్ల ఈ దుస్థితి దాపురించింది. ఎన్నో ఏళ్లుగా ఈసమస్యను పరిష్కరించమని నీటి పారుదల శాఖాధికారులను, రాజకీయ నాయకులను కోరినా పరిష్కారం లేదని రైతులు వాపోతున్నారు. దీనికి తోడు తెగుళ్లు విసిగి వేసారిపోయేటట్లు చేస్తున్నాయి. ఈ వర్షాలకు బుచ్చిలోని పలుపల్లపు ప్రాంతాలు కూడా మునిగిపోయాయి. హవున్ తోటలోని కొంత భాగం, సుహాసిని నగర్, బస్టాండు వద్ద మరి కొంత భాగంలో ప్రజలో నేటికి నీటి మడుగుల్లో నివసిస్తున్నారు.

### బుచ్చిలో పోలీస్ సర్కిల్ కార్యాలయం

బుచ్చిరెడ్డిపాళెంలో డిశంబర్ 5 తేది పోలీస్ సర్కిల్ కార్యాలయాన్ని ప్రారంభిస్తున్నారు. ఈ సర్కిల్ పరిధిలోకి బుచ్చి, దగదర్తి, సంగం మండలాల్లోని పోలీస్ స్టేషన్లను చేరుస్తారు. నెల్లూరు రూరల్ సబ్‌డివిజన్ పరిధిలో ఈ కార్యాలయం పనిచేస్తుంది. బుచ్చి -వ్యభిచారం, పేకాట వంటి వ్యసనాలకు పేరు పడుతూంది. సర్కిల్ కార్యాలయం ఏర్పాటు వల్లనైనా వీటికి బ్రేకు పడుతుందో లేదో వేచిచూడాలి.

### మలిదేవి కాలువకు మోక్షం

బుచ్చిరెడ్డిపాళెం నుండి ప్రారంభమయ్యే మలిదేవి డ్రెయిన్ ను అభివృద్ధి పర్చను ప్రపంచ బ్యాంకు నిధులు మంజూరైనట్లు ఎమ్మార్వో ఎన్.భాస్కర నాయుడు చెప్పారు. డ్రైన్ ఇరుప్రక్కల గ్రామాల ప్రజలు ప్రస్తుతం జరుపుతున్న సర్వేకు సహకరించాలన్నారు. మాజీముఖ్యమంత్రి శ్రీఎన్.జనార్ధనరెడ్డి అభివృద్ధి నిధులు మంజూరు చేయించారు.

### శ్రీనివాసుల రెడ్డి

మాజీ మంత్రి శ్రీ నల్లపురెడ్డి శ్రీనివాసులురెడ్డి 28తేది నెల్లూరులో దిగి కోట గ్రామానికి వెళతారు; 28,29 కోట; 30తేది నెల్లూరునుండి హైదరాబాదు ప్రయాణం.

### మార్కెటింగ్ కమిటీ సమావేశం

గూడూరు అగ్రికల్చర్ మార్కెట్ కమిటీ తొలిసమావేశం 19 తేది మార్కెట్ కమిటీ అధ్యక్షుడు శ్రీ ఎల్లసిరి గోపాల్ రెడ్డి అధ్యక్షతన జరిగింది. మార్కెట్ యార్డ్ నిర్మాణానికి అందరికీ అందుబాటులో వుండే అనువైన స్థలాన్ని ఎంపిక చేయాలని తీర్మానించారు. అందుగ్గాను 25తేది టౌన్‌లోని నిమ్మ వ్యాపారస్తులతో సమావేశం కూడా జరిపారు.

### కోవూరుపై కరుణ చూపండి

పలు సమస్యలతో సతమతమై పోతున్న కోవూరు వాసులపై కొత్త క్యాబినెట్ మంత్రి శ్రీ పసల పెంచలయ్య అయినా కరుణ చూపాలని సర్పంచ్ శ్రీ అత్తిపల్లి సుందరరామిరెడ్డి కోరుతున్నారు. పంచాయతీ ఏమాత్రం అలక్ష్యం చూపకుండా కరెంట్ బిల్లులు చెల్లించినా పంచాయతీ ఆఫీసు కరెంట్ కనెక్షన్ కట్‌చేసారని ఆర్టీసి బస్‌స్టేషన్ నిర్మాణానికి స్థలం సిద్ధంగా వున్నా పనిని ప్రారంభించ లేదని, 1987 నుండి టోబిఫూట్ వివాదం తెగి తెల్లార లేదని మంత్రిగారికి వినతి పత్రం సమర్పించారు. సర్పంచ్.



24.తేది అంబేత్కర్ భవన్‌లో బలహీన వర్గాల వారికి ఖాదీ బోర్డు రుణాల చెక్కులు అందజేస్తున్న సమాచార శాఖ మంత్రి శ్రీ పసల పెంచలయ్య

### కావలిలో సైన్స్‌ఫెయిర్

జిల్లావిద్యాశాఖ ఆధ్వర్యాన విద్యావైజ్ఞానిక ప్రదర్శన 27 తేది నుండి 30 వరకు కావలి ఎ.బి.ఎం కళాశాలలో నిర్వహిస్తున్నట్లు విద్యాశాఖాధి కారి ఎన్. శ్రీరామమూర్తి తెలుపుతున్నారు. జిల్లాలోనివున్నత పాఠశాలలు, జూనియర్ కాలేజిల లోని హైస్కూల్ విభాగాలు ప్రాథమిక కోన్నత పాఠశాలల విద్యార్థులు ఈ ప్రదర్శనలో తమ వుపాధ్యాయులతో కలిసి పాల్గొనవచ్చు.

### చేపల చెరువులకు రుణాలు

జిల్లాలో మంచినీటి చేపల పెంపకానికి అనువైన భూముల్లో చెరువులు త్రవ్వాలను కొనే ఔత్సాహికులను ప్రోత్సహించేందుకు మత్స్యకృషివలుల అభివృద్ధి సంస్థ నెల్లూరులో ఏర్పాటయ్యింది. ప్రతి సంవత్సరం 100 హెక్టారుల అనువైన భూమిలో 100 చెరువులు త్రవ్వను 100 మందిని ఎంపిక చేస్తారు. చెరువు త్రవ్వేందుకు లక్షరూపాయల రుణం బ్యాంకు ద్వారా ఇప్పిస్తారు. దీనిలో 20వేల సబ్సిడీ వుంటుంది. చేప పిల్లలను పెంచే నిమిత్తం మరో 16వేలు కూడా బ్యాంకు ద్వారా ఇప్పిస్తామని. ఉత్సాహవంతులు మత్స్యకృషివలుల సంస్థ నె నెల్లూరు కార్యాలయములో సంప్రదించవచ్చంటున్నారు.

### కోవూరు గ్రంథాలయ వారోత్సవాలు

కోవూరు శాఖా గ్రంథాలయంలో 25 వ జాతీయ గ్రంథాలయ వారోత్సవాలు 14 తేది నుండి 20 వరకు ఘనంగా జరిగాయి. 14 తేది వీటిని సర్పంచ్ శ్రీ అత్తిపల్లి సుందర రామిరెడ్డి ప్రారంభించారు. ఆరోజు పాఠశాల విద్యార్థినీ, విద్యార్థులకు ఆటలపోటీలు, చిత్రలేఖన పోటీలు నిర్వహించారు. 15న వక్తృత్వ పోటీ, 16న పుస్తక ప్రదర్శన, 17న వ్యాసరచన పోటీ, 18న క్విజ్ పోటీలు ఏర్పాటయ్యాయి. 19 తేది స్వర్గీయ ఇందిరాగాంధీ జన్మదినోత్సవాన్ని పురస్కరించుకొని మహిళలకు ముగ్గులు, పాటల పోటీలు పెట్టారు. విజేతలైన 46 మంది విద్యార్థులు ఇతరులకు సర్పంచ్, లైబ్రేరియన్ వెంకటరత్నారెడ్డి బహుమతులు అందజేశారు.

### కాంట్రాక్ట్ క్లాసులు ప్రారంభం

జనమడుగు హైస్కూలు సార్వత్రిక విద్యాపీఠం కాంట్రాక్ట్ ప్రోగ్రాం క్లాసులను హెడ్ మాస్టర్ శ్రీ బి.ఎల్.వి. సుబ్రహ్మణ్యం 25తేది ప్రారంభించారు. బడి మానివేసిన 18సంవత్సరాలలోపు వారికి దృశ్య, శ్రవణ, బోధన పరికరాల ద్వారా వివిధ పాఠ్యాంశాలను బోధిస్తారు. జనమడుగు , లేగుంటపాడులనుండి ఈ క్లాసులకు 60మంది హాజరయ్యారు. 13 రోజుల పాటు జరిగే ఈ కోర్సులలో వృత్తివిద్యలలో కూడ శిక్షణ యిస్తారు. ఈ కార్యక్రమానికి ఎం.ఇ.ఓ. శ్రీ ఎం.వెంకటేశ్వర్లు, టీచర్ కౌన్సిలర్లు, పి.సి.వీరాఘవ రెడ్డి, ఎన్. సుధాకరరెడ్డి నేతృత్వం వహిస్తున్నారు.

### ఇందుకూరుపేట టీచర్ల సంఘం

ఇందుకూరుపేట మండల ఆంధ్రప్రదేశ్ ఉపాధ్యాయ సంఘం శాఖ సర్వసభ్యసమావేశం 15తేది రాష్ట్ర కార్యదర్శి శ్రీ డి. కొండారెడ్డి అధ్యక్షతన జరిగింది. ఈ సందర్భంగా జిల్లాశాఖ ఉపాధ్యక్షులు శ్రీ షేక్. నజీర్‌భాష ఆధ్వర్యంలో కార్యవర్గ ఎన్నికలు జరిగాయి. మండల శాఖ అధ్యక్షుడుగా జక్కా సుబ్రహ్మణ్యం , ప్రధాన కార్యదర్శిగా షేక్. నజీర్‌భాష కోశాధికారిగా బి. రాధాకృష్ణయ్య ఎన్నికయ్యారు.

## పంచాంగము

### ముహూర్తములు

తేది 29 ఆదివారము ఉదయము 8.56 గంటలకు ధనుర్లగ్నమున వ్యాపారం భములకు

తేది 3 గురువారము రాత్రి 1.32 గంటలకు కన్యాలగ్నమున గృహప్రవేశ ములకు సుముహూర్తములు కలవు.

### నవంబరు తిథులు

మార్గశిర్ష శుద్ధ

| | |
|---|---|
| తే 28 శని చతుర్థి సా.గ. | 3.20 వ |
| తే 29 ఆది పంచమి సా.గ. | 4.57వ |
| తే 30 సోమ షష్టి సా.గ. | 6.30వ |
| డిసెంబరు తిథులు | |
| తే 1 మంగళ సప్తమి రా.గ. | 8.45వ |
| తే 2 బుధ అష్టమి రా.గ. | 10.55వ |
| తే 3 గురు నవమి రా.గ. | 1.00వ |
| తే 4 శుక్ర దశమి రా.గ. | 2.55వ |

స్వయంపాకుల శ్రీనివాసులు ఎం.ఎ

జమీన్‌రైతు
సంవత్సర చందా రూ.100.00
ఆరు నెలలకు రూ.50.00
విడిప్రతి రూ. 2.00

హోస్టాథియాన్
ద్వంద్వ చర్య కలిగిన సరిక్రొత్త కీటకనాశిని
వరి పైరు రక్షణకై సరిక్రొత్త ఆయుధం
వరిపైరు నాశించు ఆకు ముడత పురుగు, ముివ్వ పురుగు, తాటాకు పురుగు, లద్దె పురుగులను సమర్థవంతంగా నివారించుటకుఎకరానికి రెండు వందల యాభై మి.లీటర్ల హోస్టాథియాన్ వాడండి.
గమనిక: రైతుల సేవార్థము 1 లీటరు హోస్టాథియన్ కొన్నవారికి 100 గ్రాముల డెరోసాల్ ఉచితముగా ఇవ్వబడును.
హోస్టాథియన్
డెరోసాల్
వరి పంటనాశించు ఆకుమచ్చ,పండుఆకు మరియు అగ్గితెగుళ్ళ నివారించుటకు ఎకరమునకు 100గ్రా. డెరోసాల్ పిచికారి చేయండి.
Hoechst

## నిర్మాతలకు ముఖ్యమంత్రి హితవు

# 'సబ్సిడీలిస్తాను కాని పాడు చిత్రాలు తీయడం మానండి!'

ఇటీవల మన రాష్ట్ర ముఖ్యమంత్రి శ్రీ కోట్ల విజయ భాస్కరరెడ్డిని తెలుగు చలన చిత్ర ప్రముఖులు కొందరు కలుసుకుని ప్రస్తుతం ఇస్తున్న వినోదపు పన్నురాయితీలు, సబ్సిడీ మరో అయిదేళ్ళపాటు కొనసాగించాలని కోరారు. పరిశీలిస్తానని ముఖ్యమంత్రి చెప్తూ, "నేడు దేశం ఎంతో క్లిష్టపరిస్థితుల్లో ఉంది. ఎక్కడ చూసినా అశాంతే. హింసనూ, అరాచకాన్నీ, అశ్లీలాన్నీ రెచ్చగొడుతూ నేడు వస్తున్న సినిమాలు పరిశీలిస్తే, డబ్బు కోసమే కొందరు సినిమాలు తీస్తుండడంతో 'మంచి' అదుపు తప్పుతోందని విశదమౌతోంది. సమాజానికి ఉపయోగపడే చిత్రాలు నిర్మించండి," అని సలహా ఇచ్చారు. ఇలా మంత్రులు పదే పదే ఒక వంక సలహాలు ఇస్తున్నా, నిర్మాతలు మాత్రం వాళ్ళ దారిని వదలరు.

సినిమా కొందరికి వ్యాపారం. అందులో కోట్లు సంపాదించినవారికి నేడు సినిమాలు తీయడం ఒక "సరదా" అయిపోయింది. అందుకే రాశి పెరిగి, వాసి తరిగి, నాసిరకం సినిమాలు తయారవుతున్నాయి. రాయితీలు, నంది అవార్డుల మూలంగా సాంఘిక ప్రయోజనాలు, కళాత్మక విలువలు గల చిత్రాలు తయారవవని ఏనాడో తేలిపోయింది.

### "మేజర్ చంద్రకాంత్"

"సినిమా కళ, రాజకీయాలు రెండూ ప్రజాసేవకే. దాదాపు 35 ఏళ్ళగా 321 చిత్రాలలో విభిన్నమైన పాత్రలు ధరించడం ద్వారా సమాజాన్ని అర్థంచేసుకొన్న వ్యక్తిగా, రాజకీయాలు కూడా ఒక ప్రక్రియగా భావించి, తొమ్మిది నెలల వ్యవధిలోనే అధికారం సంపాదించాం," అన్నారు ఎన్.టి.ఆర్. నవంబర్ 20న "మేజర్ చంద్రకాంత్" చిత్రానికి ప్రారంభోత్సవం జరిగినప్పుడు ఈ చిత్రంలో ఈయనతోపాటు

కొరవ 10 పేజీలో



అడివారు, అమావాస్య చిత్రంలో మాంత్రికుడుగా వెంట్రిలోయిస్టు ఎం.ఎస్.రావు, రాంబాబు

## ఇదండీ తెలుగు సినిమా పాటల తీరు!

# 'అదరగొట్టుకోర సామి రంగా గదికి ఎత్తుకెళ్లి సుబ్బరంగా'

సినిమా వార పత్రికల రిపోర్టర్లకు ఏం మేటర్ రాయాలో దిక్కుతోచకుండా ఉంది. "ప్రెసిడెంటుగారి పెళ్లాం" లో మీనా "ఉమ్మకావాలి" అనే మాటను ప్రేక్షకులు బాగా ఎంజాయ్ చేస్తున్నారు. - అని "శివరంజని" రిపోర్టర్ రాస్తే అంతకన్నా ప్రాధాన్యత ఇచ్చి పెద్ద హెడ్డింగుతో "సితార" విలేఖరి అదే విషయాన్ని ఇంకో విధంగా గ్లోరిఫై చేస్తూ రాశాడు.

"కొంగుచాటు కృష్ణుడు"లోని ఈ పాట చూడండి:-

"అదరకొట్టుకోర సామిరంగా
గదికి ఎత్తుకెళ్ళి సుబ్బరంగా
మొదలు పెట్టుకోరా చెమ్మచెక్క
మందు హోరులోనే వీర కోరు చేయ్."

ఈ పాటను అద్భుతంగా వ్యాఖ్యానించింది ఓ సినీ వారపత్రిక. ఆ విలేఖరి ధర్మమా అని ఈ పాట అప్పుడే సెన్సార్ వారి దృష్టికి వెళ్లిందట.

"ముఠా మేస్త్రి"లో ఒక పాట చిత్రగించండి

"సూపర్ బాపతు సుకుమారి
నీ పేపులు కరగక తప్పదులే
కాకరకాయల కామాక్షి
నీ చేదుకు బెల్లం యమరుచిలే."

పై పాట చిరంజీవి, సిల్క్‌స్మిత‌పై చిత్రీకరింపబడింది! ఇలాంటి పాటలను సెన్సార్ వారికి ముందుగా తెలియ చేసి 'సినిమా వారపత్రిక' రిపోర్టర్లు పుణ్యం కట్టుకుంటున్నారు.

## సినిమా చూస్తుంటే రక్తం ఉడుకెక్కి పోతూంది!

# శౌర్యచక్ర

"ఈ ఖాకీ డ్రస్సులో వున్న ప్రతి దారపుపోగు నా ఉద్యోగ బాధ్యతల్ని నేను గుర్తుపెట్టుకునేందుకు ఆధారం"- అంటుంది భారతి(శోభన) అనే పోలీస్ అధికారిణి. ఆ విధంగా అనే వాళ్ళు ఈనాడు పోలీస్ శాఖలో ఎంతమంది వున్నారు? పోలీసు రక్షణదళంలో భారతి వంటి అధికార్ల అవసరం చాలా వున్నది. ఎందు చేత నంటే ఈనాటి సమాజం ఒకరి నొకరు దోచుకుతినే స్వార్థపరుల చేతుల్లో అట్టుడిగి పోతూవుంది. అన్యాయాలను భరించలేక, అక్రమాల ధాటికి తాళలేక ఉక్కిరి బిక్కిరైపోతున్న జీవితాలు లెక్కకు మించి పోతున్నాయి. రాజకీయ విషవలయంలో జాతి మొత్తం కలుషితమై పోయింది. సుఖశాంతులు నశింపజేసే ఈ గడ్డు పరిస్థితులను ఎదుర్కోగల శక్తి చట్టానికుంది. కాని ఆ చట్టాన్ని కట్టుదిట్టంగా అమలు పరిచే భారతి వంటి పోలీస్ అధికార్లు లేరు, అటువంటి వారు చాలా అవసరం. భారతి వంటి పోలీస్ అధికారిని చూసైనా అటువంటి అధికార్లు తయారు కావాలి.

భారతి చిన్న తనం నుంచి చురుకైన అమ్మాయి. కాలేజీలో ఇంకా కరుగ్గా తయారౌతుంది. ఈనాడు కాలేజి విద్యార్థి సంఘాల ఎలెక్షన్లు అసెంబ్లీ ఎలెక్షన్ల కంటె తీవ్రరూపంలో జరుగుతున్నాయి. రాజకీయ నాయకుల జోక్యం కూడా ఎక్కువగా వుంటూవున్నది. కాలేజీలో చదివే మంత్రులు, యం.యల్.ఏల కుమారులు కాలేజీ ఎలెక్షన్లలో పోటీకి దిగుతున్నారు. వారు తమ తండ్రుల రాజకీయ అండతో చేసే హంగామా అంతా ఇంతా కాదు.

భారతి కాలేజి రోజుల్లోనే రాజకీయ దురహంకారంపై ధ్వజమెత్తుతుంది. మంత్రులు, యం.యల్.ఏల కొడుకులకు పోటీగా నిలుస్తుంది. కాలేజి ఎలెక్షన్ల లో గెలుస్తుంది. రాజకీయ అండతో సంఘ వ్యతిరేక శక్తులుగా మారుతున్న




విద్యార్థులను ధనాధన్, ఫటాఫట్ చేస్తుంది. ఆ తర్వాత ఉద్యోగ రీత్యా పోలీస్ అధికారిణి అవుతుంది. ప్రజల బ్రతుకులతో ఆడుకుంటున్న ప్రజానాయకుల, రాజకీయ రాక్షసుల ఆట కట్టిస్తుంది. ఈనాటి సాంఘిక దురవస్థకు మూల కారణమైన రాజకీయ వ్యవస్థ మీద దెబ్బతీస్తుంది. తాగి తైతక్కలాడుతూ దుర్మార్గాలు చేసి, చేయించే యం.యల్.ఏలను అరెస్టు చేస్తుంది. నానా రకాల మత్తుల్లో తేలిపోతూ గెస్టుహవుసుల్లో ఆడవాళ్ళ మానాన్ని హరించే యం.ఎల్.ఏల, మంత్రుల కొడుకులకు మన దేశంలో కొరతే లేదు. ఆ కోవలో ఒక యం.యల్.ఏ కొడుకు లెక్చరర్ సరస్వతిని మానభంగం చేసి దాచేస్తాడు. ఆ పిశాచిని భారతి జుట్టుపట్టుక ఈడ్చుకొచ్చి, కోర్టులో నిలబెట్టి శిక్ష వేయిస్తుంది.

అన్యాయాన్ని శిక్షించటంలో, ధర్మాన్ని రక్షించటంలో భారతికి తనా మనా తేడా లేదు. తన అక్కకు ఆడపిల్ల పుడుతుందని తెలుసుకున్న ఆమె భర్త గర్భస్రావం చేయించేందుకు సిద్ధమవుతాడు. అది తెలిసిన భారతి అతని దుమ్ము దులిపేస్తుంది. అలాగే తన తమ్ముడు మాదక ద్రవ్యాలకు అలవాటు పడడం చూచి అతన్ని అరెస్టు చేస్తుంది.

ఇలా సమాజంలో జరిగే అన్యాయాలు, అక్రమాలు, దురాచారాలు, కోకొల్లలుగా బహిర్గతం చేస్తుంది ఈ చిత్రం. ఈ చిత్రం చూస్తుంటె ఈనాడు అధికార యంత్రాంగంలోను, దేశ నిర్మాణంలోను జరిగే కుతంత్రాలు, మోసాలు ఎన్నో మన కళ్ళకు కట్టాయి. చిత్రం చివరన రాజకీయ దురహంకారంతో, కక్షసాధింపుగా భారతి భర్తను (రాజ్‌కుమార్)ఆమె కళ్ళముందె చంపుతారు. అంతటి అధికారిణి ఆపదలో వున్నా రాజకీయ నిరంకుశత్వానికి జడిసి ఆమె భర్త శవాన్ని శ్మశానానికి తరలించేందుకు ఎవ్వరూ తోడురారు. ఒక బెంకాయ మట్టమీద భర్త శవాన్ని వుంచి ఈడ్చుకొనిపోయి, శ్మశానంలో దహనం చేస్తుంది. అగ్నిజ్వాలలు భర్త శవాన్ని దహిస్తుంటె నేపథ్యగానం ఆమెను ఉద్రేక పరుస్తుంటె భారతి రుద్రరూపం

కొరవ 10 పేజీలో

ప్రియా సిమెంట్ వినియోగదారులకు శుభవార్త!

కంప్యూటర్ టెక్నిక్‌తో డ్రైప్రాసెస్‌లో గట్టిదనం, నాణ్యత, దారుఢ్యగల సిమెంట్ తయారు చేసిన నిర్మాతలుగా పేరు పొందిన
ప్రియదర్శిని సిమెంట్ లిమిటెడ్‌వారు
ఇప్పుడు ఎక్కువ గట్టిదనం చాలా పటిష్ఠమైన నిర్మాణానికి
43 గ్రేడ్ సిమెంట్
ఉత్పత్తి చేసి అమ్మకాలు మొదలుపెట్టారు.
వినియోగదారులకు వారుఖర్చుపెట్టిన ప్రతి రూపాయికి పూర్తివిలువ ఇవ్వగలిగింది ప్రియా సిమెంట్ మాత్రమే.
సాధారణ పోర్ట్‌లాండ్ సిమెంట్ 43 గ్రేడ్
అంటే మరింత గట్టిదనం! మరింత దారుఢ్యం! మరింత నాణ్యత!

సిమెంట్ రంగంలో రారాజు
ప్రియా సిమెంట్

Priyadarshini Cement Ltd.
RAJBHAVAN ROAD, HYDERABAD – 500 482

## బాపట్ల డి.ము కోర్టులో

Succession O.P. No. 4/92

పిటిషనరు:- మేడుగ నిర్మల Vs

రెస్పాండెన్ట్సు:-1. మేడుగ ప్రేమయ్య 2. మేడుగ ఆరోగ్యం 3.మేడుగ ఇసాక్ 4. మేడుగ ఏబ్బె 5. వెల్లుపల్లి పాప ఎలియాస్ రాణి 6. ది సూపరింటెండెంట్ ఆఫ్ పోలీస్ ఖమ్మం.

### నోటీసు

పై నెంబరు పిటిషన్‌లో పిటిషనరు భర్త అయిన లేటు మేడుగ నాగేశ్వరరావు పోలీసు కానిస్టేబుల్‌గా ఖమ్మంలో పనిచేయుచు 1-5-1992 తేది మరణించి నందున సదరు డిపార్టుమెంటు నందు లేటు నాగేశ్వరరావుకు రావలసి యున్న సర్వీసు బెనిఫిట్ వగైరాలకు రు.25,000/- పైగా రావలసియున్న సైకమునకు పిటిషనరు వారసురాలుగా కోరుచు వారసత్వపు సర్టిఫికేట్ ఇప్పించమని పై నెంబరున పిటిషన్ దాఖలు చెయ్యగా 7-12-92 వతేదిన వాయిదా ఉన్నది. సదరు తేదికి ఉదయం 10.30 గంటలకు పై కోర్టు వారి ఎదుట ఎవరికైన ఆక్షేపణలు ఉన్నయెడల స్వయంగా గాని వకీలు ద్వారా గాని హాజరై తమ ఆక్షేపణలను తెలియచేసుకొనవలసినది లేనియెడల పరోక్షమందు కోర్టువారు తీర్మానించెదరు.

**T. క్రిష్ణారావు**
పిటిషనరు తరపున అడ్వొకేటు.

---

## నెల్లూరు 1వ అదనపు డిస్ట్రిక్టు మునసబు వారి కోర్టులో

E.P. No. 230/1991
O.S. No. 620/1987

శ్రీ వేదాంత దేశికర్ దేవస్థానము, రంగనాయకుల పేట, నెల్లూరు, రెప్రజెంటెడ్ బై మేనేజింగ్ ట్రస్టి
శ్రీ కె.ఏ. శ్రీ రామన్ - D.H.r

Vs

తిరువాయి పెంచలయ్య - J.D.r

### వేలం ప్రకటన

యీ నెంబరున యీ క్రింది షెడ్యూలు దాఖలా JDr తాలూకు సిరాస్తిని 7.12.92 తేది పగలు 10.00 గంటల నుండి బహిరంగముగా పై కోర్టులో వేలం వేయబడును. కనుక కావాల్సిన వారు పాడుకొనవచ్చును.

### షెడ్యూలు

నెలూరు డిస్ట్రిక్టు, నెల్లూరు తాలూక, ముత్తుకూరు రెవిన్యూ మండలం, రంగాచార్యుల కండ్రిగ, H/o. బ్రహ్మదేవం.

పట్టానెం: 499 సర్వే నెం : 532-7

పూర్తి విస్తీర్ణం : Ac 1-89 Cts

అనుభవం : Ac. 1-73 Cts

భూమి వివరం : మాగాణి

### హద్దులు

తూర్పు: కోంక; దక్షిణం: వనం సుబ్బమ్మ భూమి; పడమర: వంగిపూడి వరసమ్మ భూమి; ఉత్తరం: శ్రీ కె.ఏ. శ్రీరామన్ భూమి కొంత వరకు Sk. రంతులీబి భూమి కొంత వరకు

DHr క్రయం రూ. 20,000.00

అమినా క్రయం రూ. 25,000.00

**ఆర్.వి. రామమూర్తి**
DHr అడ్వొకేటు

---

## నెల్లూరు జిల్లా జడ్జికోర్టులో

IA No 317/92/ OP No / 92

A.P.S.R.T.C. rep by it's Managing Director, Musheerabad, Hyderabad - Petioner

Vs

R.Ravindra Reddy and another - Respondents

To
R. Ravindra Reddy,
S/o. MallaRedy, Owner of the parcel bus Service bearing registration number ATN 363 rehiding at Kapu St, Nellore.

పై నంబరున పిటిషనరు నష్టపరిహారం నిమిత్తం పై OP దాఖలు చేసుకొనుటలో 14, రోజులను ఆలస్యమును మన్నించమని పై నంబరు గల పిటిషను దాఖలు చేసుకొని యున్నారు. ఈ పిటిషను విషయమై మీకు ఏలాంటి ఆక్షేపణలున్ననూ తేది 30-11-92 వ తేదినాడు మీరుగాని, మీ ఖుద్దున గాని, లేదా వకీలు ద్వారాగాని, ఆక్షేపణలు పై కోర్టులో ఉదయం 10.30 గంటలకు దాఖలు చేసుకొన వలెను. లేని యెడల మీ పరోక్షములో తీర్మానించబడును.

**M.Ramachandra Reddy**
పిటిషనరు అడ్వొకేటు, నెల్లూరు.

---

## బాపట్ల పి. డి.ము. కోర్టులో

O.S.28/88EP100/90

DHR : కాకరపర్తి లక్ష్మీకాంతమ్మ
JDR. కాకుమాను శ్యాంప్రసాద్

DHRతరపున దాఖలు చేసిన వేలం షెడ్యూలు.

గుంటూరు డి. నర్సారావుపేట ఆ.డి. చిలకలూరి పేట సబ్ ఆ. యిలాకా పాల పర్రుగ్రామంలో ప్రతివాది (JDR) కు హక్కుభుక్తములు కలిగి స్వాధీనాను భవములో యుండి ఫయిల్ జప్తుకాబడి వేలం కావలసిన ఆస్తి వివరము.

డి.నె.272/1 నెంబరులో య.5.63సెంట్లలో య.3.85సెంట్లు HC1.440భూమికి హద్దులు తూర్పు. కాకుమాను నాగబ్రహ్మచారిగారి భూమి ద. డొంక ఉసగల్లు తాలూకు;ప.పోపూరి రంగారావు భూమి; ఉ. మన్నావకోటేశ్వరరావు భూమి;

యీ హద్దుల మధ్య య. 3.85సెంట్లు HC 1.440 శిస్తుమాగాణిభూమి .

DHR వాల్యూ -రు. 30,000/-

అమినా విలువ -రు60,000/-

NB:- EC దాఖలా అన్యాక్రాంతములు 1 డినెం.272/1 నెంబరులో య.5.63సెంట్లు 30.8.78తేదిన గుంటూరు యూనియన్ బ్యాంకిలో రు 10,000/-లకున్నూ, సదరు బ్యాంకిలో తిరిగి 28-11-78న రు.10,000/-లకున్నూ మరల 2-12-78న రు.12,000లకున్నూ తిరిగి డి.నెం. 272/1 నెంబరులో య.1.40సెంట్లలో య. 1-78సెంట్లు 12-12-81న పున్నవ కోటేశ్వరరావుకు రు4000/- లు కు తాకట్లు పెట్టబడియున్నది. సదరు తాకట్లకులోబడి పాట జరుపవలసియున్నది.

వేలం వాయిదా:- 21-12-1992

**T.కృష్ణారావు**
అడ్వొకేటు For DHR, బాపట్ల

---

## పెద్దాస్పత్రి

4 పేజి తరువాయి

గదులలో డాక్టర్లే వుండరం లేదు.

ఆస్పత్రిలో 230 పడకల వరకు వున్నాయి. పలువార్డులుగా వాటిని విభజించారు. పడకల సంఖ్యకు తగినట్లు డాక్టర్లు, నర్సులు, సాంకేతిక సిబ్బంది, పారిశుధ్యపు పనివారు వగైరాలంతా వున్నారు. కాని సర్జికల్ క్లినిక్ తప్ప తక్కిన వార్డులన్నీ ఖాళీయే. ఆ వార్డు కూడా పోలీసు కేసుల పుణ్యమా అని నిండుతుంటుంది. ఇన్‌పేషంట్‌గా చేరాలంటే సిఫార్సు కావాలి; లేదా ముడుపు చెల్లించాలి. ఇన్‌పేషంట్ల సంఖ్య ఏ నెలలోనూ 700 కి మించడం లేదు. జూలైలో 688, ఆగస్టులో 623, సెప్టెంబరులో 695, అక్టోబరులో 653, మంది మాత్రమే ఇన్‌పేషంట్లుగా చేరి చికిత్స పొందారు. సరాసరిన నెలకు 25 మంది చస్తుంటారట. అక్టోబరులో మరణాల సంఖ్య 32కి పెరిగింది. గుండె జబ్బులు, కలరా రోగులు ఎక్కువగా వున్నారట ఆస్పత్రిలో!

పెద్దాస్పత్రిలో కుక్కకాటు రోగులే ఎక్కువే! కాని వ్యాక్సిన్ సరఫరా సరిగా లేదు. మే, సెప్టెంబరు నెలలో అసలు వ్యాక్సిన్ లేక, రోగులను వెనక్కు త్రిప్పి పంపేశారట.

మందుల విషయం పెద్ద గోల్మాలే! ఏటా లక్షలాది రూపాయల మందులు కొన్నట్లు రికార్డులు చూపుతుంటాయి. కాని ఆస్పత్రిలో అవెప్పుడూ స్టాక్ వుండవు. ఔట్ పేషంట్లకు, ఇన్‌పేషంట్లకు కూడా చీటీలు వ్రాసిఇచ్చి, బయట తెచ్చుకోమంటున్నారు. కొన్ని చిన్న చిన్న కంపెనీల దగ్గర కొనుగోలు చేసే మందులు ఆస్పత్రికి చేరక ముందే మాయమై పోతుంటే, ప్రభుత్వరంగ సంస్థల నుంచి కొనే యాంటిబయాటిక్స్ వంటివి అంగళ్లకు, డాక్టర్లు తమ ఇళ్లలో పెట్టిన మందుల షాపులకు తరలిపోతుంటాయి. కుక్కల వ్యాక్సిన్‌ను సైతం అమ్మేస్తున్నారని వదంతి.

ఇక పేషంట్లకు ఇచ్చే ఆహారం సంగతి చెప్పనే అవసరం లేదు. అంత నాసిరకంగా అన్నం పెట్టగలగడం ఆ ఆస్పత్రి ఒక్కదానికే చెల్లింది. అన్నం చూస్తే చిమిడి ముద్దయి పోయి వుంటుంది; సాంబారు అని పేరే కాని, అవి రంగునీళ్లు; రొట్టెలు మాడిపోయి వుంటాయి; నీళ్లలో పాలచుక్కలు కల్పి తెల్లగా మార్చి ఇస్తుంటారు; రోజూ కోడిగ్రుడ్డు పెట్టాలన్నది రూలు - కాని ఎప్పుడో కాని ఇవ్వరు. ప్లేటు భోజనానికి ఐదు రూపాయలు బడ్జెట్ అట. ప్రైవేటు కంట్రాక్టరుకు అది గిట్టుబాటు కాకనే ఈ పరిస్థితి అంటారు. అందువల్లే ఇచ్చే ఐదు రూపాయలకు అంతకంటే మంచి భోజనం పెట్టమని అడగలేక, నాసిరకమని తెలిసినా చూస్తూ వూరకుంటు న్నామని డాక్టర్లంటున్నారు.

ఆస్పత్రిలో వున్న పలు వైద్య పరికరాలు సరైన నిర్వహణ లేక నిరుపయోగంగా పడి వుంటున్నాయి. పలు పరికరాలను అసలే వాడడం లేదు. ఆఖరకు ఆపరేషన్ థియేటర్‌ను సైతం ఎంత నిర్లక్ష్యంగా నిర్వహిస్తున్నది చెప్పలేము. చిన్న మరమ్మత్తు చేయించలేక పదిహేను రోజులు పేషంట్ల ప్రాణాలు తీశారు. అక్టోబరు నెలలో చావుల సంఖ్య పెరగడానికి ఆపరేషన్ థియేటర్ మూత పడడానికి అవినాభావ సంబంధం వుందనే అనుకోవాలి.

ఆస్పత్రి ఆవరణ వర్ణించ లేనంత ఘోరంగా వుంది. 90 ఎకరాల విస్తీర్ణమయ్యే నరికి ఎక్కడేమి జరుగుతున్నదో ఎవరికీ తెలియదు. లోపల ఎర్రగులక తోలుకపోయి గుంటలు పెట్టేశారు. వాటిలో నీళ్లు చేరి, మురిగి, దోమల ప్రసూతి కేంద్రాలుగా తయారై వున్నాయి. రాత్రయితే ఆస్పత్రి పై దాడిచేసి, డాక్టర్ల కంటే ఎక్కువగా రోగుల రక్తం పీల్చేస్తున్నాయి. దక్షిణపు తట్టు గేటును ఇటీవల తెరచిపెట్టారు. ఆ వైపు రాకపోకలు లేవుగాని, పశువులు పందులకు మాత్రం రహదారిగా పనికి వస్తున్నది. ఆవరణమంతా వాటిదే ఇష్టారాజ్యం ;చుట్టూ కాంపౌండ్‌ను పలుచోట్ల పగుల కొట్టి కాలి బాటలు ఏర్పర్చారు ఇరుగుపొరుగు కాలనీల వాసులు. ఆ చుట్టూ ప్రక్కల వారి కందరికీ ఇదే బహిరంగ బహిర్భూమి. ఈ ఛండాలం చాలదన్నట్లు ఆస్పత్రి ఎదురుగా వున్న హోటళ్ల వారు ఎంగిలాకులు, ఇతర చెత్త తెచ్చి కాంపౌండ్ పై నుంచి ఆవరణలోకి విసిరేస్తున్నారు. వాటి కోసం పశువులు, పందులు పొంచి వుంటాయి. పెత్తనం చేసే పెద్దలకు ఇటువంటి విషయాలేమీ పట్టవు. కనీసం చెత్తను లోపల పోయడాన్ని కూడా నివారించ లేని చవట దద్దమ్మలై పోయారు. వారి సమయమంతా మందులమ్ముకోవడానికి, వర్గాలతో కుమ్ములాడుకోవడానికే చాలడం లేదు. నెల్లూరు పెద్దాస్పత్రికి ఏదో శని పట్టినట్లుంది. లేకుంటే ఇటువంటి వారి చేతిలో పడి ఇన్నేళ్లు నలిగి పోతుందా! ఎమ్మెల్యేలు, మంత్రులకు ఇటువంటివేమీ పట్టవు - వారి లోకం వారిది!

- అల్లూరు రహీం

---

## శౌర్యచక్ర

(9 పేజీ తరువాయి)

దాలుస్తుంది. దుష్టసంహారం చేస్తుంది. అందుకే భారత కేంద్ర ప్రభుత్వ అవార్డు "శౌర్యచక్ర"కు అర్హురాలైంది. ఆ కారణంగా ఈ చిత్రం "శౌర్యచక్ర" అన్న సార్థక నామానికి అర్హత పొందింది.

అరణి వ్రాసిన కథలో కొత్తదనం కన్పించక పోయినా, కనిపించిన పాత సంగతులన్నీ ఈ నాటి సమాజంలోని దురాగతాలను మరొక సారి జ్ఞప్తిచేశాయి. దుష్టసంహారం పూర్తిగా జరిగే వరకూ ఇలాంటి చిత్రాలు అవసరం. కాని మాటలు రాసిన గణేష్‌పాత్రో, దర్శకత్వం వహించిన బోయిన సుబ్బారావు ఈ చిత్రంలోని సన్నివేశాలకు మరికొంత బలం కూర్చివుంటే బాగుండేది.

నాయికకు ప్రాధాన్యత ఉన్న చిత్రం ఇది. శోభన పోలీస్ అధికారిణిగా చిత్రం భారమంతా సమర్థవంతంగా మోసింది. రాజ్‌కుమార్ చేవగల హీరోకాగలడు. కోట, వేలు, సాయికుమార్, బాబూమోహన్, అంతా చక్కగా నటించారు.

అన్నిటికంటే పి. భాస్కరరావు ఫోటో గ్రఫీ బాగుంది.

---

## సినిమా

(9 పేజీ తరువాయి)

మోహన్‌బాబు, జగ్గయ్య, గుమ్మడి, అమ్రేష్‌పురి, బాబూమోహన్, బ్రహ్మానందం, ప్రసాద్‌బాబు, సాయికుమార్, బాలాజీ, మనోజ్‌కుమార్, 'ఊర్వశి' శారద, నగ్మా, రమ్యకృష్ణ అన్నపూర్ణ, కిన్నెర, సుధ, బేబి శ్రేష్ఠ పాత్రధారులు. రచన: పరుచూరి సోదరులు; సంగీతం: ఎం.ఎం.కీరవాణి, దర్శకత్వం: కె. రాఘవేంద్రరావు; ఫిబ్రవరి నెలాఖరుకు షూటింగ్ పూర్తవుతుందట.

## ప్రేక్షకులలో చైతన్యం

ప్రేక్షకులు ద్వంద్వార్థ సంభాషణలు, సెక్స్ దృశ్యాలే కోరుతున్నారు గనుక అలాంటి చిత్రాలనే నిర్మాతలు తీస్తున్నారనడం కేవలం సినిమా వార పత్రికల సృష్టి. సారా ఉద్యమానికి ముందే సినిమాలలో అశ్లీలానికి నిరసనగా ఒక ఉద్యమానికి మహిళలే ఏనాడో శ్రీకారం చుట్టారు. అది నేడు మరింత బలపడుతుంది.

ఒక వంక ప్రభుత్వం పొదుపు చర్యల పేరిట ప్రజలకుపయోగ పడే ఎరువులు వంటి వాటిపై సబ్సిడీలు రద్దుచేస్తుంటే ఇంకొక ప్రక్క వినోద కాలక్షేపం కోసం తయారయ్యే సినిమాలకు మాత్రం నిర్మాతలు కోట్లాది రూపాయలు సబ్సిడీలు, రాయితీలు పొందుతున్నారు. దర్శక నిర్మాతలను, నటీ నటులను, సాంకేతిక నిపుణులను మరింత ఐశ్వర్య వంతులను చేసే ఈ రాయితీలు, సబ్సిడీలను ఇంకా కొనసాగించడం ఎంత వరకు సమంజసం అనే విమర్శ ఇటీవల ప్రజల నుంచి తరచు వినిపిస్తోంది. దానికి తగ్గట్టు సినిమా వార పత్రికలు "రాష్ట్రంలో చలన చిత్ర పరిశ్రమాభివృద్ధి" అనే పెద్ద పెద్ద హెడ్డింగులతో ఒక ఫైటింగ్ సీన్ కోసం 20 లక్షల ఖర్చుతో భారీ సెట్ వేశారు; చిరంజీవి పారితోషికం కోటిన్నర రూపాయలు దాటిపోయింది." వంటి వార్తలను కొండంతలు చేసి ప్రచురించడంతో ప్రజలలో విపరీతమైన ఆలోచనలు కల్గిస్తున్నాయి. వాళ్ళందరికీ కోట్ల సంఖ్యలో ముట్టే ధనం ప్రతి ప్రేక్షకుడు కొనే టిక్కెట్టు ద్వారానే. చిరంజీవి అమెరికాలో విశ్రాంతి తీసుక వచ్చాడంటే, అందుకైన ఖర్చు మధ్యతరగతి, పేద వర్గాల సినిమా పోషణ మూలంగానే- అని భావించే రోజులు వచ్చాయి. అసలు ఇటువంటి ఆలోచనలు ప్రజలకు కల్గకూడదు గాని, కల్గితే ఇక అంతే సంగతులు. మన రాష్ట్రంలోనే తెలుగు చిత్ర పరిశ్రమ స్థిరపడడం వల్ల ఒరిగేదేమీ లేదు. నాణ్యత లేని చిత్రాలకు రాయితీలు ఇవ్వడం వల్ల ప్రజాధనం దుర్వినియోగం అవుతున్నట్లే అని ప్రజలు భావించే సమయం ఆసన్నమైంది గనుక ప్రభుత్వం ఈ విషయంలో మెళకువ వహించక తప్పదు.

## ఆదివారం అమావాస్యలో నెల్లూరు మాంత్రికుడు

పద్మావతి పిక్చర్స్ బేనర్ పై సి.హెచ్. మురళీకృష్ణ ప్రముఖ మలయాళ దర్శకుడు బేబి దర్శకత్వంలో నిర్మించిన హారర్, టెర్రర్ చిత్రం – 'ఆదివారం అమావాస్య' షూటింగ్, డబ్బింగ్ కార్యక్రమాలు ఇటీవల ముగిసాయి. డిశంబర్ 18 తేది విడుదలకు రంగం సిద్ధం చేశారు. నెల్లూరీయుడు, మానస గ్రూప్ అధినేత ఎమ్.ఎస్. రావు ఈ చిత్రంలో మాంత్రికుని పాత్రలో కనిపిస్తారు. అన్ని వర్గాల ప్రజలను ఆకట్టుకొనే విధంగా తీశామని చెబుతున్న ఈ చిత్రంలో కె.వి. సోమయాజులు, కాంతారావు, అచ్యుత్, రాజా, జయరేఖ, లక్ష్మి ప్రియ నటిస్తున్నారు; సంగీతం, రాజ్‌కోటి, ఛాయాగ్రహణం దేవరాజ్, మాటలు అప్పలాచార్య.

## జనవాణి

(3వ పేజీ తరువాయి)

అర్హనాదాలు వారికి వినిపించలేదు. ఆర్థిక ప్రాతిపదిక పైన ఈ 27శాతం రిజర్వేషన్లు కేటాయించి వుంటే అన్ని వర్గాలకూ మేలు కలిగేది.

- వి. మాధవరావు

కోవూరు

### ఈ పద్ధతి బాగుంటుందేమో!

కొన్ని దేశాలలో రోడ్డుకు ఎడమ వైపున జనం నడుస్తారు. మరి కొన్ని దేశాలలో కుడి ప్రక్కన నడుస్తారు. మన దేశంలో మాత్రం రోడ్డుకు అడ్డంగా నడుస్తారని హాస్యప్రియులు చమత్కరిస్తారు. ఆంధ్రప్రదేశ్‌లో ఇతర పట్టణాల రోడ్లను నేను చూడలేదు గాని, నెల్లూరు టౌన్‌లోని రోడ్లను చూసి మాత్రం ఆశ్చర్యం కల్గింది. ఇటీవల కొద్దిపాటి వర్షానికే నాశనమై వాహనాల సంగతేమో కాని, మనుషులు కూడా నడువలేని పరిస్థితి ఏర్పడింది. రోడ్లను ఆనుకొని ఉండే డ్రైన్ల గురించి చెప్పనక్కరలేదు. ఇటీవల మద్రాసు మౌంట్ రోడ్డులోని తౌసండ్ లైట్స్ సెంటర్ వద్ద నుండి అన్నా విగ్రహం వరకు 4 లైన్ల ట్రాఫిక్ సిస్టమ్ [illegible] పెట్టారు. మొదటి లైన్‌లో మనుషులు, రెండవ లైన్‌లో బస్‌లు, లారీల వంటి భారీ వాహనాలు, మూడవలైన్‌లో స్కూటర్లు ఆటోలు, నాల్గవ లైన్‌లో కార్లు టెంపోలు వెళ్లాలి. ఈ పద్ధతి వల్ల ప్రమాదాలు అరికట్టబడతాయి. నిర్దేశించిన రూట్‌లో వెళ్లకుంటే స్పాట్‌లోనే జరిమానా చెల్లించాలి. ఈ విధానం ఇక్కడ విజయవంతమయ్యింది. నెల్లూరు వంటి పెద్ద పట్టణం ఈ విధానం ప్రయోగాత్మకంగా చేపడితే బాగుంటుంది.

- ఎమ్. గణేష్ రాం

మద్రాస్

### సహకార బ్యాంకుకు సరియైన సారథి వేమారెడ్డి

నెల్లూరు కేంద్ర సహకార బ్యాంక్ అధ్యక్షులు శ్రీ వేమారెడ్డి రామచంద్రారెడ్డి బ్యాంక్ అభివృద్ధి కోసం పడుతున్న తపన చూస్తుంటే సంతోషమేస్తుంది. బ్యాంకు బకాయిలను వసూలు చేయను జిల్లా వ్యాప్తంగా ఆయన తిరుగుతున్న వైనం ప్రశంసనీయం. పెయిడ్ సెక్రటరీలకు వారి విధులను గుర్తుచేసి కార్యోన్ముఖులను చేయడం చూస్తుంటే సహకార బ్యాంకుకు ఇన్నాళ్లకు సరియైన సారథి దొరికాడనిపిస్తుంది.

- జె. శ్రీనివాసులు రెడ్డి

కోవూరు

### తొండ ముదిరి ఊసరవెల్లి అయ్యింది

1990 ఏప్రెల్ నెలలో 'జమీన్‌రైతు' సింహపురి శీర్షికలో 'కోచింగ్ సెంటర్లు ఇంటర్ ఇన్‌విజిలేటర్లు' అనే శీర్షిక ఎన్నో యదార్థ విషయాలు రాశారు. గత రెండు సంవత్సరాలలో తొండ ముదిరి ఊసరవెల్లి అయినట్లు ప్రభుత్వ ప్రైవేట్ జూనియర్ కాలేజిల్లోని లెక్చరర్లు తమ ఉద్యోగాలకు సెలవులు పెట్టికోచింగ్ సెంటర్లలో చేరి లక్షలు సంపాదిస్తున్నారు. అటో కాలు - ఇటో కాలు వేసే ఇటువంటి లెక్చరర్ల వల్ల క్లాస్ రూమ్‌లో పాఠాలు పిచ్చినట్లుంటున్నాయి. కోచింగ్ సెంటర్ల పిల్లల కోసం వీరు ఎంత శ్రమిస్తున్నారంటే పరీక్షల సమయంలో మాత్రం డ్యూటీలకు హాజరై తమ సెంటర్లకు చెందిన పిల్లలకు నీవాతి నీచంగా కాపీలందిస్తున్నారు. ఈ విధానాన్ని అరికట్టే నాథుడే కరువయ్యారు. దీనివల్ల ట్యూషన్లలో చేరలేని మధ్య తరగతి కుటుంబాల పిల్లలు కాలేజీలకు వెళ్లి తిరిగి రావడం తప్ప అక్షరం ముక్క నేర్చుకోలేక పోతున్నారు.

- పి. సుబ్బారావు

నెల్లూరు

### నాగార్జున అభిమానుల్లా ప్రవర్తించండి

గత సంచికలో శ్రీ.ఎన్.వి. సుబ్బయ్య గారు 'ఆద్రనుతెల్పండి' అనే ఉత్తరంలో వెలిబుచ్చిన అభిప్రాయం అర్థరహితం. చిత్ర సమీక్షకుడంటే, చిత్రం మొత్తాన్ని బేరీజువేసే వ్యక్తి అని గుర్తుంచుకోవాలి. వాస్తవానికి అతను ప్రస్తావించిన మూడు చిత్రాల సమీక్షలు 'జమీన్‌రైతు 'లో మరో సమీక్షకుడు వ్రాసారని గమనించక పోవడం శోచనీయం. అయినా ప్రతి సినిమా అందరికీ నచ్చాలన్న రూల్ ఏమైనా ఉందా? పత్రికలపై నిత్యం విరుచుక పడే రాజకీయ నాయకుల్లా అర్థంలేని వాదనలకు దిగకుండా విమర్శను హుందాగా స్వీకరించే రియల్ హీరో నాగార్జున వ్యక్తిత్వానికి తగ్గట్టు ప్రవర్తిస్తారని ఆశిస్తాము.

-కె. శ్రీనివాసులు,

మొగళ్ళూరు

-ఎస్.మహబూబ్‌బాష

కలిచేడు.

### దేవస్థానంలో క్షురకుడు కరువయ్యాడు

నేను మా బిడ్డకు పుట్టి వెంట్రుకలు తీయించుకొనేందుకు స్వామివారి మీద ఎంతో భక్తి ప్రపత్తులతో కుటుంబ సమేతంగా నరసింహస్వామి కొండకు వెళ్ళగా, క్షురకుడే దొరకలేదు. మేమే బ్లేడు కొని రేజర్‌తో మా బిడ్డకు పుట్టు వెంట్రుకలు తీసుకొన్నాము. ఎంత ఖర్మ పట్టిందో చూడండి. దేవస్థానం పాలక వర్గానికి గాని అక్కడి ఉద్యోగస్థులకుగాని దేవస్థానం విధులమీద ఎంత శ్రద్ధవుందో చెప్పేందుకు ఇది ఒక తార్కాణం. ఇకనైనా ఇటువంటి సంఘటన జరుగకుండా భక్తులకు వసతులు కల్పించడంలో శ్రద్ధ తీసుకోవాలి.

-రవి.

పార్లపల్లి.

## సింహపురి

(4 పేజీ తరువాయి)

పెంచలయ్యను 24 తేది అంబేద్కర్ భవన్‌లో ఘనంగా సన్మానించింది. జిల్లాలోని హరిజనులు అంబేద్కర్ భవనాన్ని అధికంగా వినియోగించుకొనే అవకాశాన్ని నిర్వాహకులు కల్పించాలని మంత్రి కోరారు. పలువురు వక్తలు మంత్రి శ్రీ పెంచలయ్య గుణగణాలను ప్రస్తుతించారు. ఈ కార్యక్రమంలో ఎమ్పీ కుమారి కె. పద్మశ్రీ, ఎమ్మెల్యే శ్రీ జె.కె. రెడ్డి, కలెక్టర్ శ్రీ ఎం. సాంబశివరావు, శ్రీయుతులు తేరే రాయప్ప, ఎస్. సి. ఉద్యోగుల సంఘానికి చెందిన ఎం. అర్జున రావు, వై. రవీంద్రనాథ్ తదితరులు పాల్గొన్నారు.

### ధన్వంతరి జయంతి

వైద్యశాస్త్ర బ్రహ్మధన్వంతరి జయంతిని వర్ధమాన సమాజం సౌజన్యంతో సాహిత్యసదస్సు సంస్థ 22 తేది టౌన్ హాల్‌లో జరిపింది. ఉత్తర ప్రదేశ్ మాజీ గవర్నర్ డాక్టర్ బెజవాడ గోపాలరెడ్డి సదస్సును అధ్యక్షవారు. తెలుగు సాహిత్యంలోని పలు గ్రంథాలలోని హాస్యరసాన్ని శ్రీ న్వయంపాకుల శ్రీనివాసులు తనదైన బాణీలో చెప్పి శ్రోతలను అలరించారు. ప్రముఖ ఆయుర్వేద వైద్యులు శ్రీ ఎం. వెంకటేశ్వర్లు, కళాప్రపూర్ణ మరుపూరు కోదండరామిరెడ్డిని సన్మానించారు. సభానంతరం ఎ. రమాదేవి, లక్ష్మీప్రసన్నలు పాటలు పాడారు.

### రిటైర్డు ఉద్యోగుల సమావేశం

రిటైర్డు ఉద్యోగుల సంఘసమావేశం డిశంబర్ 3 తేది టౌన్‌లోని రేబాల పట్టాభిరామిరెడ్డి పఠన మందిరంలో జరుగనున్నది. రాష్ట్ర రిటైర్డ్ ఉద్యోగుల సంఘ ప్రతినిధులు పాల్గొని సంఘ అభివృద్ధి గూర్చి జరుపవలసిన కార్యక్రమాలు వివరిస్తారని; అనంతరం నూతన కార్యదర్శి ఎన్నిక జరుగుతుందని రిటైర్డ్ ఉద్యోగులు విరివిగా పాల్గొనాలని జిల్లా కమిటీ మెంబర్ శ్రీవి. కృష్ణారావు కోరుతున్నారు.

### సంస్మరణ సభ

నెల్లూరు నాటకరంగ పితామహుడు కందాడై శ్రీనివాస దొరస్వామి సంస్మరణ సభ 30 తేది సాయంత్రం ఆంధ్ర సభ భవనంలో జరుగుతుంది. పలురంగాల్లో పేరుగాంచిన కళాకారులు శ్రీయుతులు దొడ్ల సుబ్బరామిరెడ్డి, పి. శంకరయ్య, గాదెపల్లి రామయ్య, శ్రీమతి కె. రత్నం, హార్మోనిస్టు కె. రామారావు, తబలా విద్వాన్, డి. అబ్రహాం, రూపశిల్పి, టి. సుందరంను సన్మానిస్తారని సంస్థ కార్యదర్శి శ్రీ వైద్యుల శ్రీనివాస రావు తెలుపుతున్నారు.

### పాక్షికంగా బంద్

అత్యవసర వస్తువుల ప్రత్యేక నిబంధనల చట్టాన్ని రద్దుచేయాలన్న డిమాండ్‌తో టౌన్‌లోని 19 వ్యాపార సంఘాల పిలుపు మేరకు24 తేది దుకాణాల బంద్ పాక్షికంగా జరిగింది. 60శాతం పైగా అంగళ్లు ఆరోజు మూతపడ్డాయి. 2వేల మంది వ్యాపారులు స్టోన్ హౌస్‌పేట నుండి ఊరేగింపుగా బయలుదేరి కలెక్టర్ ఆఫీసులో జాయింట్ కలెక్టర్ కు, టౌన్‌హాలులో ఉండిన మంత్రి శ్రీ పెంచలయ్యగారికి మెమొరాండం సమర్పించారు. ఎం.పి. కుమారి పద్మశ్రీ, ఎమ్మెల్యే శ్రీజె.కె.రెడ్డి లకు కూడా మెమొరాండం లు ఇచ్చారు. ఈ కార్యక్రమానికి హమ్మిన సుబ్రహ్మణ్యం, సి.సి. సుబ్బారాయుడు, వెంకటేశ్వర్లు, మాదాల గోపాలయ్య, బాలతిమ్మయ్య, రామచంద్రయ్య నాయుడు నాయకత్వం వహించారు.

## వైఎస్!

(మొదటి పేజీ తరువాయి)

అంతుబట్టక దిగాలు పడి ఎమ్మెల్యేలు చెట్టుగొకరు పుట్టకొకరవుతున్నారు. "పోయినోడె మంచోడు" అంటూ అసమ్మతీయులు ఇప్పుడు 'జనప్రియ' ప్రవేశానికి తహతహ లాడుతున్నారు. జనార్దన రెడ్డి పై తిరుగుబాటు బావుటా ఎగరేసిన మాజీమంత్రి పాలదుగు వెంకటరావు ఈ మధ్య తరమా 'జనప్రియ'కు వచ్చి వెళ్తున్నారట. మరో మాజీ మంత్రి చిత్తరంజన్ దాస్ స్వయంగా జనార్దన రెడ్డిని కలిసి తన ప్రవర్తనకు పశ్చాత్తాపం వ్యక్తం చేసినట్లుతెలిసింది. జనార్దన రెడ్డిని తీవ్రంగా వ్యతిరేకించిన ఎంపీ వై.ఎస్. రాజశేఖర రెడ్డి వర్గీయులు కూడా 'కోట్ల' కంటె జనార్దనుడే 'బెటర్' అంటున్నారు. పైరవీ కోసం వెళితే జనార్దనుడు పనిచేసినా, చేయక పోయినా కనీసం కూర్చోబెట్టి కుశలం అడిగేవాడని, కోట్ల కోటలో 'కుశలం' కూడా కరువైందని వారు వాపోతున్నారు.

'అసమ్మతీయుల్ని' ఊచకోత కోసిన విజయుడు తన పద్ధతి మార్చుకొని అన్ని వర్గాలను సమంగా చూడకపోతే, గతంలో మాదిరిగానే వచ్చే అసెంబ్లీ ఎన్నికల్లో కూడా అధికారాన్ని పళ్లెంలో పెట్టి రామారావుకు అప్పజెప్పిన వ్యక్తిగా 'కోట్ల' మిగిలిపోతాడని వై.ఎస్ వర్గీయులు బాహాటంగానే చెబుతున్నారు.

## ఎమ్మెల్యేలు

( మొదటి పేజీ తరువాయి)

చేసుకునేందుకు త్వరలోనే 'శివాలయదర్శనం' చేయించాలని కలికి కుతూహల పడుతున్నట్లు భోగట్టా. కలికి వారి శిష్యుడ్ని అని చెప్పుకునే విష్ణువర్ధన్ రెడ్డి కూడా గురువుకు ఏ మాత్రం తీసిపోకుండా తన ప్రయత్నాలు తాను చేసుకుంటున్నారట. "విష్ణు మంచి బాలుడు" అని కోట్ల వారు కితాబు కూడా ఇవ్వటంతో సహజంగానే ఆయనలో నమ్మకం పెరిగినట్లు కనబడుతోంది. జనార్దనరెడ్డి దయతో మంత్రి కాలేక విప్పుగా మిగిలిపోయిన సర్వేపల్లి శాసనసభ్యుడు సి.వి. శేషారెడ్డి పూర్తిగా తప్పక తిరిగితే బాగోదని అడపాదడపా వెళ్లి కోట్ల దర్శనం చేసుకుంటున్నారట. పెంచలయ్య మంత్రి కాబట్టి ఆయనకు ఎలాగూ నిత్యం కోట్ల దర్శనం తప్పదు.


బలాది లేహ్యం

నరముల బలహీనత గుండె దడ, ఆయాసము, బ్లడ్ ప్రెషరు, మొదలగు వానిపై పని చేయును.• జీర్ణశక్తి, పుష్టి బలము ఉత్సాహమును కలిగించును.

200 గ్రాముల సీసా రూ. 40/- మా వద్ద ప్రశస్థ ఆయుర్వేద ఔషధములు లభించును.

జనార్ధన ఆయుర్వేద ఫార్మసి

4/607 ఉస్మాన్ సాహెబ్ పేట,

నెల్లూరు - 524 002



పశువుల మందులు

అన్ని ప్రముఖ కంపెనీల పశువుల మందులు మా వద్ద లభించును

వివేకా మెడికల్స్

16/1295/3, పొగతోట సెంటర్,

ట్రంకురోడ్డు, నెల్లూరు

ఫోన్: 27691



శ్రీ యేటూరు శివరామకృష్ణారెడ్డి గారిని (రేబాల)

కోవూరు కో ఆపరేటివ్ చక్కెర ఫ్యాక్టరీ చెరకు

అభివృద్ధి మండలి అధ్యక్షులుగా ప్రభుత్వము

నియమించినందులకు మా

హృదయపూర్వక అభినందనలు.



నవంబరు 30 వ తేది ఉదయం 9 గంటలకు

పదవీ స్వీకారము చేయు శుభ సందర్భమున

మా శుభాకాంక్షలు.

సామంతు సుబ్బారెడ్డి (ఛైర్మన్)

పి. రాధాకృష్ణారెడ్డి (వైస్ ఛైర్మన్)

వి. నిరంజన్ రెడ్డి (డైరక్టర్)

కోవూరు సహకార పంచదార కర్మాగారము, నెల్లూరు.

# సంస్మరణ



మా అభివృద్ధికి కారకుడు, నెల్లూరు జిల్లా

ప్రముఖ మైకామైనర్

## శ్రీ దొడ్ల నారపరెడ్డి గారు

గూడూరు

పరమపదించి **1.12.1992** తేదికి రెండు సంవత్సరాలు పూర్తవుతాయి.

ద్వితీయ వర్ధంతి సందర్భంలో వారి ఆత్మకు చిరశాంతిని కలుగుజేయమని భగవంతుని ప్రార్థిస్తూ వారిని సంస్మరించు కొంటున్నాము.

భార్య
దొడ్ల సరోజనమ్మ
కుమార్తెలు
శ్రీమతి డాక్టర్ ఎన్. ఉషాకిరణ్
శ్రీమతి యం. శోభారాణి

కుమారుడు
దొడ్ల సుకుమార్‌రెడ్డి
అల్లుళ్ల
డాక్టర్ ఎన్.ఆర్. సాయికుమార్‌రెడ్డి
యం. రవీంద్రనాథ్‌రెడ్డి

మరియు మనుమలు, మనుమరాండ్రు

... Published by N. Dolendra Prasad at Zamin Ryot Press, Nellore OFFSET Printing at Nayagara Books (Pvt) Ltd.